డిశంబరులో

విడుదల

శోభనాచల వారి,

# ప్రజాసేవ

డైరెక్షన్......ప్రభాకరావు..





త్వరలో
వస్తూంది!
జి.వరలక్ష్మి. సూర్యకళ.
అనసూయ. కోటిరత్నం.
బలిజేపల్లి.
అమర్‌నాథ్. రామశర్మ.
చలం. పండితరావు.
గణపతిభట్.
నటించినది...
అశోకా పిక్చర్స్ వారి.
నాచెల్లెలు
దర్శకుడు..
చిత్రపు నారాయణమూర్తి. బి.ఏ.
మాటలు..
పరశురామ్..
పాటలు.
ప్రయాగ..
ఫొటోగ్రఫీ..
బి.ఎస్.రంగా..
సంగీతం...
సి.యస్.పాండురంగన్..
స్టూడియో..
రేవతి.
KRISHNA




చ ్రమి యా 8 లీ జ్

# విషయసూచిక





'ప్రజాసేవ' లో లక్ష్మీరాజ్యం.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# అఖిలాంధ్ర పరిషత్తు - ప్రభుత్వ ప్రకటనలు



శ్రీ పొట్టి శ్రీరాములుగారు కొనసాగిస్తున్న ప్రాయోపవేశం సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణానికని ఉద్దేశించబడింది.

శ్రీరాములుగారు ఏరాజకీయపక్షమునకుగాని, వర్గమునకుగాని చెందినవారు కారు. ఆంధ్రప్రజానీకపు పురోభివృద్ధికిగల ఆటంకాలు తొలగిపోడానికి సత్వరాంధ్ర రాష్ట్ర నిర్మాణమే సాధనమనినమ్మి, అందుకుగాను తన ప్రాణములను సయితం అర్పించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై ఒత్తిడి కలిగించుటకు, బాధ్యతా రహితంగా వ్యవహరిస్తున్న ప్రజానీకంలో చైతన్యం కలిగించడానికి పూనుకొనిన స్వార్థత్యాగి. వీరి లక్ష్య సిద్ధి కొరకనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యపై ఏకాభిప్రాయ సాధనకని, శ్రీరాములుగారిని సంరక్షించుటకని మద్రాసులో అఖిలాంధ్రపరిషత్తు శ్రీ ప్రకాశంగారి అధ్యక్షతన సమావేశమయింది. కాని ఆనాటి సంఘటనలు తృప్తికరంగా లేకపోవడం చాల విచారకరం. కొన్ని రాజకీయపక్షాలు యీ సమావేశముయొక్క ప్రధానోద్దేశముకంటే స్వార్థానికి ప్రాముఖ్యమివ్వడం సిగ్గుచేటు.

ప్రతివ్యక్తికి, పక్షానికి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికిగల హక్కును గుర్తించవలసిందేకాని ఏకాభిప్రాయము సాధనకని సమావేశమయిన పరిషత్తులో రసాభాసంగా, అసభ్యంగా వ్యవహరించడం ఏ పార్టీకి భావ్యంకాదు. పైగా వారి ప్రత్యేకతను మాత్రం ప్రదర్శించుకోడం అయింది.

శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి తీర్మానం సమగ్రమైనదనే చెప్పాలి. అందులో మద్రాసు నగరమును, పరిసర ప్రాంతాలను చీఫ్‌కమీషనరు రాష్ట్రంగాచేస్తూ సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగాలనిభావం. అయితే మద్రాసుపై అన్ని విధాల ఆంధ్రుల హక్కున్నప్పటికి నగరంలోని ప్రస్తుతపు వివిధభాషలవారికి సమాన అవకాశములను, హక్కులను కల్పించే భాగంగా నుండాలని యీ తీర్మాన సారాంశం. ఇది చాల విశాల దృష్టితోటి, నగరంలోని ఆంధ్రులకు, ఆంధ్రరాష్ట్ర పురోభివృద్ధికి ఉద్దేశించినది.

ఇక శ్రీ నాగిరెడ్డిగారి సవరణ అంటూ ప్రతిపాదించినది మద్రాసు భవితాన్ని రాష్ట్రనిర్మాణంతో ముడిపెట్టకూడదని, దానిని ప్లేబిసైటుద్వారా తేల్చుకోవచ్చునని వాదన.

శ్రీ గౌతు లచ్చన్నగారు వివాద ప్రాంతాలను మధ్యవర్తిత్వానికి వదలాలన్నారు. ఇది బాగానే యున్నదికాని మధ్యవర్తిత్వానికి వదలడంకాని, ప్లేబిసైటుద్వారా తేల్చుకోడంకాని రాష్ట్రనిర్మాణంతోబాటు తేలాల్సినవేకాని ఒకటిముందు, మరొకటి వెనుక కూడదు. అట్లు కాకున్నచో ఆంధ్రులకు తీరని నష్టానికి కారణమగుతుంది.

ఇక మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారి, ఇండియా ప్రధాన మంత్రి పండితనెహ్రూ ఏమంటున్నారో చూడండి - మధ్యవర్తిత్వము, ప్లేబిసైటు ప్రసక్తే కూడదట. మద్రాసుపై తెలుగువారు తమ హక్కును సంపూర్ణంగా వదులుకున్ననాడే రాష్ట్రంనిర్మిస్తారట. ఇంతకంటె ఆంధ్రజాతికి అవమానం ఏమికావాలి? ప్లేబిసైటును, మధ్యవర్తిత్వాన్ని ప్రబోధించిన పెద్దలు యీనాడేమంటారు?

మద్రాసు ముఖ్యమంత్రి మద్రాసులోని తెలుగు మాట్లాడేవారి సంఖ్య 100-కి 16 మంది మాత్రమేననడం హాస్యాస్పదం, సత్యదూరంకూడాను. అది ఒకవేళ యదార్థమయినచో ప్లేబిసైటుకుగాని, మధ్యవర్తి నియామకానికిగాని వెనుదీయాల్సిన అవసరం ఏమిటి? చారిత్రాత్మకంగాను, జనాభానుబట్టి ఆంధ్రులకు మద్రాసు నగరంపై గల హక్కును వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా చూచిననాడే ఆంధ్రులకు న్యాయం కలుగుతుంది. లోపభూయిష్టమయిన మద్రాసు ముఖ్యమంత్రి ప్రకటనల నాధారంగా చేసికుంటే కేంద్రం ఆంధ్రులకు ద్రోహం తలపెట్టడంతప్ప మరేమికాదు.

ఇక సమగ్రమైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకని దీక్ష పూనవలసినవారు ప్రజానీకం. మద్రాసు నగరంలోని ఆంధ్రులు చరిత్రాధారములనుబట్టి, ప్రస్తుతపు తెలుగు మాట్లాడే జనాభా లెక్కలనుబట్టి మద్రాసుపై తమకుగల హక్కును రుజువు చేసికోవాలి. అందలి అన్ని భాషలవారి హక్కులను, అవకాశములను మన్నించగల చీఫ్ కమీషనరు రాష్ట్రంగా మద్రాసు ఏర్పడాలి.

మద్రాసుపై హక్కును వదలుకోవలసినదిగా చెప్పేవారికి ఒకటే సమాధానం- వదలుకుంటాముకాని దాని ఫలితంగా ఆంధ్ర ప్రజానీకం నష్టపడి మరొక ప్రాంతంవారు లాభంపొందడానికికాదు; మద్రాసులోని అన్ని భాషలవారు సమాన హక్కులను, అవకాశాలను అనుభవిస్తూ అన్యోన్యానురాగాలతోను, పరస్పర సహకారంతో మెలిగే అవకాశముండే చీఫ్‌కమీషనరు రాష్ట్రం ఏర్పడడానికి మాత్రమే.

## మా మా ట లు



ఈ సంచికతోటి భగవంతుని దయవలన మీ ఆదరాభిమానములతోటి 21-వ సంపుటము పూర్తియగుచున్నది.

ఎప్పటియట్లు అభ్యుదయ రచయితలకు, రచయిత్రులకు ప్రోత్సాహమిచ్చుచు వివిధశీర్షికలతోటి ఆకర్షణవంతంగా మా 'గృహలక్ష్మి' వెలువడుతోంది. కాని విద్యాధికులైన స్త్రీలు అనేకమంది యుండికూడ రాజకీయ, వైజ్ఞానిక, విద్యా, సాంఘిక సమస్యలపై రచనలు పంపడంలో వారి ఆసక్తి బహు స్వల్పముగా నున్నదని చెప్పకతప్పదు.

షుమారు 24 సంవత్సరములనుండి అన్ని రంగాలలోను మహిళాభ్యున్నతికి మా పత్రిక చేయుచున్నకృషి మీకు తెలియనిదికాదు. పత్రికాభివృద్ధికి, మరింత ఆకర్షణవంతంగా నుండడానికి మీ అమూల్యమైన సలహాలను మేము కృతజ్ఞతతో స్వీకరిస్తాము.

ఇప్పటివరకు మా 'గృహలక్ష్మి' ప్రతినెల 15-వ తేదిన వెలువడుతూ వచ్చింది. కొందరు ఒకటవతేదిన వెలువడితే బాగుంటుందని అభిప్రాయపడుతున్నారు. దీనిని గురించి పాఠకుల అభిప్రాయాలను స్వీకరిస్తాము.

జనవరి సంచికను 'సంక్రాంతి' సంచికగా ఎక్కువ పేజీలతో బొమ్మలు, కథలు, గేయాలు మొదలగు ఆకర్షణలతో వెలువడజేయదలచాము. రచయితలు, రచయిత్రులు తమ అమూల్యమైన వ్యాసములు వ్రాసిపంపవలసినదిగా కోరుచున్నాము.

— —(0)— —

# "అమరమూర్తి" ఆచార్య

శ్రీ సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

[శ్రీ యస్. జి. ఆచార్యగారు మాకు చిరపరిచితులేకాక ప్రథమంలో మా 'గృహలక్ష్మి' పత్రికకు సంపాదకత్వమును నిర్వహించినవారు. వారు అభ్యుదయ రచయితలకు యిచ్చిన ప్రోత్సాహము మరువరానిది. ఈ నాటి రచయితలు చాలమంది కాస్తో, కూస్తో వారి సహకార సద్భావములకు పాత్రులైనవారే. వారి స్వార్థరహితమయినసేవ, నిరాడంబరత్వము, ఉదార హృదయము నానేకమంది చవిచూచి యుంటారు. వారి రచనలతో బాటు జీవితంకూడ ఉత్తమ ఆదర్శాలు, లక్ష్యాల పూరితంగా గడచిపోయింది. తెలుగు పత్రికా రచనలోను, నిర్వహణలోను శ్రీ ఆచార్యగారు విప్లవాత్మకమయిన మార్పులు తెచ్చారు. ఈ సందర్భములో పత్రికా రచయితలు, నిర్వాహకులు, మిత్రులు వారిపేరట ఏర్పరచబడిన నిధికి విరివిగా విరాళాలిచ్చి వారి కుటుంబానికి సానుభూతి చూపడం ఎంతైనా సమంజసం. విరాళములు పంపగోరువారు మా కార్యాలయమునకు డాక్టరు యస్. శేషగిరిరావుగారిపేర పంపవగును.]

—ఎడిటర్

అదిగో జవహర్ జాకెట్టూ, ఖద్దరులాల్చీ, దోవతీ, చిరునవ్వు చిందులాడే ముఖమూ కనబడుతూ, 'ఏమండీ, కులాసాగా ఉన్నారా' అనే పలుకులు వినబడుతూ ఉంటే, ఏమిటీ ఈ పాడులోకం ఎస్. జి. ఆచార్యగారు పోయారంటుంది అనిపించింది నాకు. ఎస్. జి. ఆచార్య చనిపోయారన్న వార్త 'హిందూ' పత్రికలో చూచిన తక్షణం, శ్రీ ఆచార్యతో ఏకొద్ది పరిచయమున్న వ్యక్తి అయినాసరే ఆయనని తన జీవితంలో ఎప్పటికీ మర్చిపోలేడు. ఆయన స్నేహము, ఆదరణ అంత గాఢంగా ఉంటాయి. తనకు తెలిసిన వ్యక్తి, అతడు మిత్రుడైనాసరే రచయిత అయినాసరే, ఎదురుపడినప్పుడు తాను ఎంత అవసరమైన పనిమీద వెడుతున్నాసరే, తఫీమని ఆగిపోయి ఆ వ్యక్తి యోగక్షేమాల్ని పరామర్శచేయడం, పత్రికా కార్యాలయంలో తాను తన పనిలో నిమగ్నుడై యుండగా తనకు పరిచితుడైన రచయిత తన గదిని ప్రవేశించగానే, తాను చేస్తున్న పనిని ఆపి, అతనితో కాస్తసేపు కులాసాగా మాట్లాడి అతనికి కావలసిన కార్యమేమిటో తెలుసుకొని, అతనికి తనవల్ల వీలైనంత సహాయం చేసి అతనిని అత్యంత తృప్తితో సాగనంపడం, ఎంతమంది సంపాదకులుగాని పత్రికా రచయితలుగాని సాధించగలరో ఆలోచించండి. క్రొత్త రచయిత రచనని పంపినప్పుడు దానిని సాంతంగా, శాంతంగా చదివి, అందులో ఏ కొద్ది నీతిగాని, నవ్యతగాని

ఇసుమంతైనా, గోచరిస్తే, దానిని ప్రచురణ యోగ్యంగా ఉండేలాగాదిద్ది ఏ సంపాదకుడు తన పత్రికలో ప్రచురించడానికి ప్రయత్నిస్తాడో ఆలోచించండి. ఈ సౌజన్యం ఆయనలో ఉన్నందువల్లే వందల కొలది రచయితలు ఆయనని ఆశ్రయించారు. ఈనాడు పెద్ద పత్రికలలో రచయితలుగా చెలామణి ఔతున్న వారిలో చాలామంది మొట్టమొదట ఆయనచేత ప్రోత్సహింపబడినవారే అనడంలో ఎంత మాత్రమూ అతిశయోక్తిలేదు.

ఆయన ఓర్పు, ఉత్సాహము, వర్ణనాతీతము. ఒక రోజులో, అనగా పత్రికలు నడిచే ఆరుగంటలపరిమితిలో, 'చిత్రగుప్త' 'ప్రజాబంధు' 'చిత్రాంగి' కార్యాలయాలకి క్రమ ప్రకారం ఒక రోజుకూడా తప్పకుండా ఒక నిముషంకూడా ఆలస్యం కాకుండా వెళ్లి, తన పనిని తాను చకచకా సాగిస్తూ ఉండేవారంటే మనం నమ్మలేమేమో!

ఎంతోమంది ఆయనను గురించి వ్రాసినా, ఆయన ఆంధ్ర మహిళలకుచేసిన అపారమైన సేవను గురించి ఎవరూ వ్రాయక పోవడం చాలా శోచనీయమైన విషయం. తన భార్యసహాయంతో ఆయన 'చిత్రాంగి' అనే పత్రికని కేవలం స్త్రీల కొరకనే నడ్పేరు. స్త్రీలకు ఎన్నో విధాలుగా తోడ్పడే కథల్నీ, రచనల్నీ ఆయన అందులో ప్రచురించేరు. అది అంత ప్రచారంలోకి రాకపోవడం ధనాభావంవల్లనే అని నేను అనుకుంటున్నాను. బొత్తిగా పూర్వాచార పరాయణగా కాకుండా, కాకదేరిన నవనాగరికంగా కాకుండా, రెంటికీ సమన్వయమైన వేషంలో ముస్తాబై వచ్చేది 'చిత్రాంగి'!

ఇలాగ ఆచార్యగారిని గురించి వ్రాయాలంటే ఎంతైనా ఉన్నది. ఆయన తన 46-వ యేట చనిపోవడం ఆంధ్రపత్రికా లోకానికి తీరనిలోటు. ఆయన ఆత్మకి భగవంతుడు శాంతిని ప్రసాదించుగాక. ప్రతివిషయంలోనూ ఆయనకు చేదోడు వాదోడుగాఉండి, ఆఖరుకి జైలుకి వెళ్లడానికికూడా జంకక, నిరతము భర్తృసేవయందే తన జీవితాన్ని గడుపుతూ వస్తున్న శ్రీమతి అన్నపూర్ణాదేవిగారికి ఈ వియోగవ్యథ అత్యంత దుర్భరమైనది. ఈ వియోగాన్ని భరించగలిగే శక్తిని ఆమెకు భగవంతుడు ప్రసాదించుగాక! ఆమెకు నా హృదయ పూర్వకమైన అశ్రుమిశ్రితమైన సానుభూతులు; శ్రీ ఆచార్య గారికి నా అశ్రుతర్పణము!

# చిరస్మరణీయుడు శ్రీ ఆచార్య

శ్రీ సి. సి. పున్నయ్య



ఒక వ్యక్తి ఉత్తముడుగా గుర్తించబడటానికి అవసరమైన యోగ్యతలనన్నిటిని ఏకరువుపెట్టడంకాని, వానిని కలిగియుండటంకాని సులభసాధ్యములైనవికావు. కాని యితరులకు తనుచేయగల సహాయంచేస్తూ, ఏ పరిస్థితులలోను యితరులకు అపకారం తలపెట్టకుండా, నిరాడంబరంగా, ఆత్మవంచనలేకుండా ఉత్తమ లక్ష్యాలకు, ఆదర్శాలకు తన జీవితమును అంకితము చేసిన వ్యక్తి ఉత్తముడనే చెప్పవచ్చు. అట్టివారే శ్రీ ఆచార్యగారు.

శ్రీ ఆచార్యగారు పత్రికా రచయిత మాత్రమేకాదు; వీరోచితంగా భారత స్వాతంత్ర్య సమరంలో పోరాడిన జాతీయ యోధుడు. ఆయనతోబాటు వారిభార్య కష్టాల్లో, సుఖాల్లో సమానభాగం పంచుకున్నది. భర్తతోబాటు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని కారాగారశిక్ష అనుభవించింది. శ్రీ ఆచార్యగారి విశాలభావాలకు, ఉదార హృదయానికి వారి భార్య సహాయ సహకారాలు ఎంతో ఉపకరించినవి.

కాస్తో కూస్తో పరిచయమున్న మనబోటివారికే శ్రీ ఆచార్యగారి మరణం మితిలేని విచారమును కలిగిస్తుంటే సర్వకాల సర్వావస్థలయందు తోడు నీడగానున్న భర్త మరణంవలన ఆమెకు ఏర్పడిన దుఃఖ విచారములు ఊహించనలవికానివి.

తెలుగుపత్రికా రచయిత్వములో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చినవారు. ఆచార్యగారు తాను సుప్రసిద్ధ రచయితగా అనేకమంది అభ్యుదయ రచయితలను ప్రోత్సహించాడు. ఈనాటి అనేకమంది తెలుగుపత్రికా రచయితలు కొద్దో గొప్పో వారి సహకార, ప్రోత్సాహ, సహాయములు పొందినవారే.

వారు ఏపత్రికకు సంపాదకత్వము నిర్వహించినా స్వేచ్ఛావాతావరణంలోనే సాగించారు. ఆత్మకు విరుద్ధంగాగాని, స్వార్థపరుడుగాగాని ఏపని పూనుకొని ఎరుగడు. ఎటువంటి పరిస్థితులలోనూ ఎవరికీ అపకారంచేసి బాధపెట్టి ఎరుగని అజాతశత్రువు.

ఆయన జీవితలక్ష్యం ధనమార్జించి మేడలు మిద్దెలు కట్టాలని, ఆడంబరంగా జీవించాలని కాదుకాబట్టి తాను కండ్లు మూసేనాటికి ఆస్థిపాస్తులు ఏమిలేకపోయినవి. ఆయన రచయితగా విధివిరామంలేకుండా కృషిచేసేవాడు, చేతినిండా డబ్బు సంపాయించేవాడుకూడాను. కాని రేపటికి అని దాచడం ఆయనకు తెలిసినట్లే తెలియదు. ఎప్పటికప్పుడు ఆయనకు, ఆయన నంటిపెట్టుకొనియున్నవారికి అవసరాలు గడువడానికి సరిపోయేది సంపాదన.

పచ్చిపత్తిపట్టు వేసికొని యున్నవారికి వండి పెట్టి చాకిరిచేయలేనని ఆయన భార్య ఎప్పుడైనా ఓపికలేక కొంచెము విసుగు కుంటే, తానే స్వయంగా వంటచేసి పెట్టి వారికి తయారయ్యేవారా ఉదార హృదయుడు.

ఆ భార్యాభర్తలిద్దరు ఆడంబరమైన జీవితానికి ప్రాకులాడినవారు కారు. కాబట్టి ఆచార్యగారి భౌతిక దేహాన్ని తీసికొని పోయేముందు పూలమాలలతో అలంకరించి కడసారి చూపించడానికి ఆమెను తీసికొనివస్తే గోడుగోడున విలపిస్తూ "ఇప్పుడు కావలసి వచ్చిందా యీ తోట" అని పూలమాలలు లాగేస్తూ మూర్ఛపోయింది.

శ్రీ ఆచార్యగారి దేహం భూస్థాపిత మయింది. మరి ఆయన ఉత్తమ లక్ష్యాలు, ఆదర్శనీయమయిన జీవితం ప్రస్తుత రచయితలకు మార్గదర్శకములుగాక! అంతే కాదు వారికి ఆత్మశాంతి కలుగునట్లు భగవంతుని ప్రార్థిస్తూ వారి స్మారకనిధికి విరాళములు నిచ్చుటవలన మన కృతజ్ఞత, భక్తి గౌరవాలను వెల్లడించిన వారమగుదుముగాక!



అశోకావారి 'నాచెల్లెలు'లో జి. వరలక్ష్మి, అమరనాథ్, సూర్యకళ.

# గృహలక్ష్మి



శ్రీమతి
తిత్తి శ్రీనివాసినీదుర్గారావు

ఆవేళ సుబ్బులక్ష్మికి లేవగానే, మొట్టమొదట కాఫీ పొడరు, పంచదార లేవనే సంగతి జ్ఞప్తికి వచ్చింది.

రాత్రి ప్రకృతి ప్రసాదించిన వెన్నెల చిక్కదనంలో, చుక్కకన్నెల తళుకుబెళుకు చూపుల్లో ప్రియుని మధుర హస్తముల్లో ప్రాపంచక బాధలన్నీ మరచి నిదురపోయింది. తెల్లవారగానే, అవన్నీ చీకట్లో కలసిపోయాయి. మళ్లీ నిత్యజీవనానికి కావలసిన సంభారములకై వెతుక్కోవాలి.

పేదలకూ, ప్రేమజీవులకూ ప్రసాదించిన అమృతపు గుళిక చక్కని రాత్రేకదా! ఎంతధనమిచ్చినా ధనవంతులకు సహితం దొరకని అమూల్యమైన చల్లని వెన్నెలని, చక్కనైన చంద్రుడిని ప్రసాదించి, అలసిపోయిన పేదల హృదయాల్ని సేదదీర్చిన భగవంతుడ్ని అందుకేగా బోలు కవులు చిత్రాలు కొద్దీ వర్ణిస్తారు!

కలతలులేని మనసుతో, సాగర సంగీతమే మధుర గానముగా ఆలకించి హాయిగా నిదురపోయిన సుబ్బులక్ష్మికి సూర్యోదయపు వేడికాంతి భరింపరానిదిగ నున్నది.

మళ్లీ ఎవరిని అప్పు అడగాలి? ఆనందరావుని ఎప్పుడూ దేని విషయమై కూడా ఆమె ఇబ్బంది పెట్టలేదు. తన ఆనందమే ఆనందరావు అన్న సిద్ధాంతములో వున్న సుబ్బులక్ష్మికి యీ ఆర్థికపు చిక్కులు కొంత కలచివైచినవి.

సంసారంలో ఏదిలేకపోయినా క్షణం గడవదు. విద్యాధికుడైన భర్త, వుద్యోగం కోసం పడరాని పాట్లు పడటం తాను చూస్తున్నది. కాని ఆనందరావు మనస్తత్వమే వేరు. ఇంట్లో ఏదివున్నదో లేదో అవన్నీ ఆయనకు అవసరంలేదు. ఏవో పైప్రయత్నాలు చేస్తాడు, ఇంట్లో చిల్లర విషయాల సంగతి పట్టించుకోడు.

సుబ్బులక్ష్మిని చూడగానే ఏవో రాజకీయాలు, సాహిత్య సమీక్షలతో కాలం గడిపి ఆనందిస్తాడు. సుబ్బులక్ష్మికూడా ఇంటివిషయాల్ని సాధ్యమైనంత వరకు భర్తచెంతకు రానిచ్చేదికాదు.

ఎల్లకాలం యిలాంటి షెల్లీ బైరన్ల గోష్ఠితో కడుపు నిండుతుందా? సంసార యాత్ర వుదయం మొదలు పెట్టగానే నేటి ప్రజాసమూహానికి కాఫీ దేవత ముందు ప్రత్యక్షమవాలి; లేకపోతే కాళ్లూ చేతులూ ఆడవు.

ఆలాగే, ఆనందరావు సుబ్బులక్ష్మి సంసారంలో కూడా, ఏవో పెట్టె అడుగున మిగిలిన చిల్లరతో కొద్దిగా పంచదార, పాలూ కాఫీపొడరు యేర్పాటై ప్రాతఃకాలం గడచింది. మరి మధ్యాహ్నపు సరంజామో!

సుబ్బులక్ష్మి సహించలేక పోయింది. ఎంతసహన శీలకైనా ఒక్కొక్కప్పుడు, ఆవేశం పుట్టుకొస్తుంది.

మెల్లగా ఆనందరావు వ్రాసుకుంటున్న టేబిల్ వద్దకువెళ్లి, ఏమిటి మాట్లాడాలో, ఏమని భర్తకు చెప్పాలో అర్థంగాక నిలబడి పోయింది.

మనస్సులో పరిపరి విధాల వూహాలు తిరుగుతున్నాయి. ఏమీపట్టించుకోకుండా కూర్చున్న భర్తపై అంతకంతకూ చిరుకోపం వస్తున్నది.

ఇట్లా తనవలెనే యింట్లో కూర్చుంటే జీవితమెలాగు సాగుతుంది? జీవితం ఎట్లా గడుస్తుంది? ఏదో ఆలోచించాలిగాని పురుషప్రయత్నం లేకుండా అంతా దైవయత్నం అని వూరుకుంటే రేపటి సంగతి ఏమాతుంది?

సుబ్బులక్ష్మి ఆలోచనల్లో వుక్కిరి బిక్కిరై, "మీరిలా కూర్చుంటే మనకు కాఫీ, ఫలహారాలు, భోజనం ఎలావస్తాయండీ?" అని పౌరుషాన్ని యిరికించి అంది.

ఆనందరావు తలెత్తిచూసాడు. "సుబ్బూ! ప్రపంచంలోని అన్యులవలనే నీవుకూడా నన్ను నిందిస్తున్నావా?" ఆనందరావు గొంతుకలో మాట్లాడాడు. "మరి, ఏంచేయమంటావ్, చెప్పు! ఏదో విద్యాధికుడి ననిపించుకొని యెం. యే. వరకూ చదువు వెలగబెట్టి చివరకు మాన ప్రాణాలను అమ్మకొనే గుమాస్తాగిరీ చేయలేను. పోనీ, నాకు కాఫీ ఫలహారాలు వద్దులే!" మెల్లగా అన్నాడు.

సుబ్బులక్ష్మికి ఏమీతోచలేదు.

"మీరు మానేస్తే తక్కిన వాళ్లంతా వస్తుండా లన్నమాట! నామాటకేమి, ప్రేమాలేస్తే పాలకు ఏడుస్తుంది. పసిపిల్ల, దానికి యీ ఆర్థికపు సమస్యలేవీ తెలియవుకదా! ఏదోగత్యంతరం ఆలోచించాలిగాని అలా కూర్చుంటే యీపుస్తకాలవల్ల కడుపు నిండుతుందా?"

సుబ్బులక్ష్మి మాటలకు వుత్తేజితుడైన ఆనందరావు వెంటనే కండువా భుజం మీద వేసుకొని బయల్దేరాడు. వెళ్తున్న ఆనందరావుని చూస్తూ సుబ్బులక్ష్మి అక్కడే నిల్చుండిపోయింది. ఎన్నడూ లేనిది భర్తను నొప్పించాననే విచారంతో మనస్సు క్రుంగిపోయింది.

"ఏమనుకున్నారో ఏమో, ఎండలో, ఎక్కడికి బయల్దేరారో తెలీయదు. కోపం వచ్చిందేమో, లేక ఎవరినైన బదులడగటానికి వెళ్లారో ..."

ఆలోచనలో మునిగిన సుబ్బులక్ష్మికి చిన్నపాపాయి ప్రేమా ఏడుపు వినిపించింది. గబగబా యింట్లోకి వెళ్లిపోయింది.

సాయింత్రం అయిదు అయిపోయింది. ప్రొద్దుట నుండి పనిలో అలసి పోయిన జనం యిళ్లకు వెళ్లిపోతున్నారు. విలాసజీవులు విహారానికి బయల్దేరుతున్నారు. అప్పుడే చండకిరణుడుకూడా తన ప్రతాపాన్ని చాలించి గృహోన్ముఖుడౌతున్నాడు. ఆఫీసు గుమాస్తాలు వడివడిగా బారులు తీస్తున్నారు.

ఇల్లు, యిల్లాలు వుండికూడా ఆనందరావు యింటికి వెళ్లలేక దిగులుగా పార్కులో కూచొని సూన్యాకాశం వైపు తిలకిస్తున్నాడు. ఎంతోమంది స్నేహితుల్ని కలుసుకున్నాడు. ఆర్థిక సహాయాన్ని అర్థించాడు, లాభంలేకపోయింది. కొంతసేపు లైబ్రేరీలో గడిపి మనశ్శాంతిని కల్పించుకొని, తన సమస్యను పరిష్కరించే యే గ్రంథమూ పనికిరాకపోగా, చేసేది లేక పార్కుకి వచ్చాడు.

ఆనందరావు మనస్సు యింటిముఖం పట్టసాగింది. ఎన్నోకష్టాల్ని ఎదుర్కున్నాడు. అన్నిటిలోనూ సుబ్బులక్ష్మి ప్రసన్నవదనంలో చల్లని మాటలతో వుపశమనం పొందేవాడు. ఏదో స్త్రీ సహజమైన ఆవేశంతో ఏవేవో అన్నదని తాను మగవాడై వుండీ కూడా అలిగి కూర్చున్నాడు, తన అవివేకానికి తనకే నవ్వొచ్చింది.

తను యెం. యే. చదువుకున్నా సుబ్బులక్ష్మి లౌకిక జ్ఞానమే అవసరానికి పనికి వస్తుందేమో ననిపించింది.

వెంటనే ఆనందరావు యింటికి బయల్దేరాడు. సుబ్బులక్ష్మి కిటికీవద్దనే కూచుని ఎదురు చూస్తున్నది.

నీరసంగా కూర్చున్న సుబ్బులక్ష్మికి ఆనందరావు కనబడగానే ఎంతో బలం వచ్చినట్లయింది.

"సుబ్బూ! అలావున్నావేం, భోజనం చెయ్యలేదా? అవునుకదూ, యింట్లో ఏమీలేవు. కాఫీ అయినా త్రాగావా" అంటూ ఆనందరావు యింట్లో ప్రవేశిస్తూనే అడిగాడు.

ప్రేమావచ్చి ఆనందరావు రెండుకాళ్లూ పట్టుకొని అమాయకంగా ముఖంలోకి చూసింది.

సుబ్బులక్ష్మి రెండుకప్పుల్లో కాఫీ తెచ్చి బల్లపై పెట్టింది. ఆమెకళ్లు రెండూ నీళ్లతో నిండినై.

"ముఖం కడుక్కోండి, ఆనక కాఫీపుచ్చుకోవచ్చు. ప్రొద్దుట నుండి తిరిగి తిరిగి అలసినట్లున్నారు. ఏమన్నానని అలా అలిగి వెళ్లిపోయారు? మీరొచ్చినవరకూ నాకేమీ తోచనేలేదు. వేగం లేవండిమరి."

ఆనందరావు ముఖం కడుక్కొనివచ్చి కాఫీ ముందుకూర్చున్నాడు. "సుబ్బూ, నీవూరా" అని పిల్చేడు. ప్రేమూవచ్చి యిద్దరిమధ్యయిరికింది.

"చూడండి, ప్రేముకి ఏ ఆందోళనలూ, బాధలూ లేవుకదా! మనం కూడా యిలావుండవేం" అంది సుబ్బులక్ష్మి.

"ఏం, ఎందుకు వుండలేం, నేనుమాత్రం సిన్న చూస్తూ వుండగలను." సుబ్బులక్ష్మి సిగ్గుతెచ్చుకొని "నేనూ అంతే" అంది. ఒకరి ముఖాలొకరు చూసుకొని నవ్వుకున్నారు పిల్లల్లాగ. వాళ్లనుచూస్తూ ప్రేమూకూడా నవ్వుకలిపింది.

"మీరలా గాభరా పడ్డారుగాని వెంటనే డబ్బెలా దొరికిపోయిందో, చెప్పండి! ఇదిగో యీ వుంగరం వొకటి మిగిలుంది. ప్రస్తుతానికి పనికొస్తుందిగా, ఇది మార్చి సొమ్ము చెయ్యండి, ఆతర్వాత సంగతి ఆలోచిద్దాం."

ఆనందరావు మాట్లాడలేదు.

"ఊఁ! వెళ్లిరండి. ఉన్నకొలది చీకటిపడిపోతున్నది. ప్రేమూకి పాలూ, వంటకి సరంజామా అవీ తీసుకురండి" అని సుబ్బులక్ష్మి తొందరచేసింది.

ఆనందరావు సుబ్బులక్ష్మి చేతులు పట్టుకొని కళ్లల్లోకి చూశాడేగాని మాట్లాడలేకపోయాడు.

"పర్వాలేదు, వెళ్లిరండి. ప్రతిస్త్రీ కర్తవ్యం కూడా ఇదే" అంటూ భర్తను ప్రోత్సహించింది.

ఆనందరావు బజార్లో నడుస్తున్నాడేగాని దృష్టంతా జేబులోవున్న వుంగరం మీదనే వుంది. ఎంతోవుపద్రవంవచ్చి కూర్చుంటేనేగాని స్త్రీలు ఆభరణాల్ని మగాళ్లచేతుల్లో పెట్టరు; అందులోను పెళ్ళినాటి ప్రేమచిహ్నాలు!

ఆనందరావుకు షావుకారు శీతారామయ్య కొట్లో కనిపించాడు.

ఎంతటివారికైనా వస్తువులు విక్రయించటమంటే అవమానంగానే వుంటుంది. అటువంటప్పుడు సానుభూతికోసం ఆప్తుల్ని ఆసరా అడగటం సహజం!

షావుకారు శీతారామయ్య పైవాడుకాదు. ఆనందరావు తండ్రి ఆదరణతో చిల్లరకొట్టును బంగారం కొట్టుగా చేసుకున్న శీతారామయ్య ఆనందరావును బాగా ఎరుగును. పైగా అతని కొడుకు సుబ్బారావు ఆనందరావుతో చిన్నప్పుడు చదువుకున్నాడు.

సరస్వతీకటాక్షం కలిగిన ఆనందరావు లక్ష్మికటాక్షం కలిగిన సుబ్బారావు యిప్పుడు వేర్వేరు భవంతుల్లో మెలగటంలో వింతేమున్నది?

ఆనందరావు శీతారామయ్య కొట్లోకి వెళ్లాడు. ఆనందరావును చూడగానే గుర్తుపట్టిన శీతారామయ్య ఆప్యాయంతో ఆహ్వానించాడు.

"ఏం బాబూ, ఇలావచ్చావ్. అంతా కులాసాయేనా? పెద్దవాడవయ్యావు- పిల్లలా?"

"అవును, బాబాయ్! అవసరం వుండి వచ్చాను. యింట్లో మీ కోడలూ, చిన్నపాపాయి బాగానేవున్నారని" ఆనందరావు జవాబిచ్చాడు.

"అవును నాయినా! అవసరం లేందే మావంటి చదువురాని వాళ్లదగ్గర మీబోటి చదువుకున్న వాళ్లకేంపని? ఏంపని చేస్తున్నావ్, బాబూ!" శీతారామయ్య ఆప్యాయంగా అన్నాడు.

"లేదు బాబాయ్. ఈరోజుల్లో మాచదువులు పొట్టగడవటానికే పనికిరాకుండా వున్నాయి. ఏదో గాలిలో మేడలేకాని మీలాగ భవంతుల్నికట్టలేం."

శీతారామయ్య గట్టిగా నవ్వాడు.

"బాగా చెప్పావు బాబూ! మావాడు కూడా గాలిలో మేడలు కట్టడానికి చూస్తున్నాడు. ఏదో యీ వ్యాపారం చూసుకోరా అంటే అక్కర్లేదట. ఏవో పత్రికలని, పుస్తకాలని - తనూ ఏదో పత్రిక పెట్టాలని, ఆవిధంగా మా వైశ్యకులాన్ని వుద్ధరిస్తానని చెప్తుంటాడు. మాలోకూడా సారస్వతాభిమానులున్నారని దేశానికి చాటుతాడట. యికమిగిలింది సమర్థుడైన సంపాదకుని కోసం వెతకటమే!"

"బాబాయ్! నిజంగా మీవంటి వారే ఏసంస్థనైనా నిలబెట్టగలరు. మావంటి 'మనో ప్రపంచం'

వాళ్లం గాలిలో విహరించటమేగాని డబ్బుపట్టుకోని ఏపనీ చేయలేముకదా! మీవంటి వృక్షస్తంభాలు నిలబడితేనేకదా దానిమీద మాలాంటి వాళ్లం సాహిత్యసౌధాలు కట్టగలం!"

"ఆనందం నీవూ సమయానికే వచ్చావు. రేపే మా సుబ్బారావుతో చెప్పి నిన్ను సంపాదకునిగా నియమిస్తాను. ఏం, నీకిష్టమేనా?"

ఆనందరావు ఆశ్చర్యపోయాడు.

శీతారామయ్య ముఖంలో ఆదరణ మాత్రం తొణికిసలాడుతోంది.

"అలాగే బాబాయ్, మీరలాగంటే నేను కాదంటానా" ఆనందరావు జవాబిస్తుండగా వొళ్ళంతా గగుర్పొడిచినట్టయింది.

కాని సుబ్బలక్ష్మి వుంగరం జ్ఞప్తికొచ్చింది. ఉంగరాన్ని వదలలేక గట్టిగా పట్టుకున్నాడు.

ఆనందం అవస్థను శీతారామయ్య కనుక్కోగలిగేడు. "బాబూ, ఏమైనాసొమ్ము అవసరమా?" శీతారామయ్య మొదటి వాత్సల్యంతో అడిగాడు.

ఆనందరావు సిగ్గుపడిపోయాడు.

"అవును, బాబాయ్! యీవుంగరం వుంచి కొంతయివ్వండి. టైమయింది. యింట్లో మీకోడలు కనిపెట్టుకుంటుంది."

శీతారామయ్య వుంగరాన్ని పరీక్షగా చూశాడు. మూడు ఎర్రటి కెంపులు పొందుగా వున్నాయి. వెయ్యిగట్టి షరాబులకు మించిన శీతారామయ్య మెదడు ఆవుంగరం విలువను కట్టలేకపోయింది.

ముసలాడిహృదయం ద్రవించింది. "నాయనా! యీవుంగరాన్ని నేను బహుమతిగా యిచ్చానని కోడలికి యిచ్చెయ్. ఇదిగో యీనూరూ అడ్వాన్సుగా నీవు తీసుకో" అంటూ శీతారామయ్య పది నోట్లుతీసి ఆనందరావు కిచ్చాడు.

ఆనందరావు ఆనందానికి అంతులేకపోయింది. "రేపు సుబ్బారావుతో మాట్లాడు. జీతం హెచ్చులోనే వుంటుందిలే. యీనూరూ అడ్వాన్సు అనుకో."

ఆనందరావు రెండు చేతులూ అప్రయత్నంగా కలిసాయి. మనస్సులో శీతారామయ్యకు కృతజ్ఞత తెల్పాడు.

నిండుమనస్సుతో ఆనందరావు యింటికి బయల్దేరాడు. మిఠాయి, పూలు, పాలూ కొన్నాడు. వంట ఆలస్యమౌతుందని కేరియరు ఆర్డరిచ్చి యింటిముఖం పట్టాడు.

శుక్లపక్షపు త్రయోదశి చంద్రుడు తనతో కూడా నడుస్తున్నాడు. గాలికంటే వేగంగా మనస్సు యింటికి పరుగెత్తింది.

సుబ్బలక్ష్మి ఆనందరావు అట్టహాసాన్ని చూసి వుంగరం అమ్మి యివన్నీ ఎందుకని అనుకుందిగాని భర్తనేమీ అడగలేదు.

మిఠాయి పొట్లాం విప్పి తలొక వుండా నోట్లో వేసుకున్నారు. ఎందుకీ అట్టహాసం అన్నట్లు సుబ్బలక్ష్మి కళ్లు నివ్వెరపాటు చెందాయి.

"మేలు చేసినవారికి మిఠాయి బహూకరించమని పెద్దలుచెప్తారు కాబట్టే నీకీ మిఠాయి."

"బాగుందండీ! నేనేం మేలుచేసానని. అయినా మీరు ప్రేమ ప్రసాదిస్తే అందుకు ప్రతిఫలంగా యీప్రేమూ..."

ఇద్దరకూ ఒకేసారి నవ్వు పెదాలమీద విరుచుకుంది.

వారి మాటలకు అర్థం తెలీక చిన్నప్రేమూ నవ్వుతూ చప్పట్లు చరిచింది.

"ఆ! వంటసరంజామా ఏదీ? మరి భోజనం వద్దా?"

"ఎందుకొద్దూ, అదిగో ఆకేరియర్ లో మనకోసమే చూస్తోంది. రా, భోంచేద్దాం."

ప్రేమూకి పాలుపట్టి, నిద్దురపుచ్చడానికి సుబ్బలక్ష్మి రెండు జోలపాటలైనా పాడవలసి వచ్చింది.

ఆనందంతో ఆనందరావు కూడా కూనిరాగం తీసాడు.

"సరే, ముందు భోజనం కానివ్వండి. తర్వాత తీరిగ్గా పాడుదురుగాని."

ఆనందరావు నవ్వు ఆపలేదు. సుబ్బులక్ష్మికి అర్థం కాలేదు. దంపతులిద్దరూ భోజనానికి కూర్చున్నారు.

"సుబ్బూ! నేచెప్పలే, నీవే నా ఆనందలక్ష్మివని. నీవిచ్చిన ఆవుంగరం వలననే నాకు ఎక్కడలేని ఆనందం కల్గుతోంది."

సుబ్బులక్ష్మికి కోపం వచ్చింది.

"ఉంగరం యిచ్చినందుకు మీరు అమ్మినందుకేనా ఆనందం నాకీపొగడ్తాను?"

ఆనందరావు నవ్వుతూ కూచున్నాడు.

"అవును, మీరునన్ను వెక్కిరిస్తున్నారు. ప్రాణతుల్యమైన ఉంగరం యిచ్చానుకదూ, ఏం, యివ్వకూడదా? నేనేం ప్రాణాన్ని దానం పోసానసా మీరు నన్ను పొగడడానికి."

"కాదుమరీ, ఆవుంగరమే నన్నీస్థితికి తీసుకొచ్చిందంటే నీవునమ్మవు. మరిసంగతి వింటావా?"

సుబ్బులక్ష్మి అయోమయంగా కళ్లు నిలబెట్టి 'సరే' అన్నట్టు భర్తకళ్ళలోకి చూసింది.

"రేపటినుంచి నేనొక పత్రికా సంపాదకుడను తెలుసా, అదంతా నీవుంగరం వలనే."

సుబ్బులక్ష్మి ఆశ్చర్యపోయింది.

భోజనాలయ్యాక ఆనందరావు జరిగిందంతా సుబ్బులక్ష్మితో చెప్పాడు. తిరిగి వుంగరాన్ని సుబ్బులక్ష్మి చిటికిన వ్రేలికి అలంకరించాడు.

వికసించిన తామరపూవువంటి ఆమె ముఖాన్ని ఆనందరావు తన రెండు చేతుల్తో పైకెత్తి ఆమె కళ్ళల్లోకి చూస్తూ "సుబ్బూ, నీవు నా ఆనందలక్ష్మివేకదూ ..." అని సూటిగా అడిగాడు.

అవ్యక్త మధుర తంత్రులు మీటినట్లయింది సుబ్బులక్ష్మికి. ఎదురుగనున్న ఆనందరావు ఆనందముకన్నా కావలసిందేముంది సుబ్బులక్ష్మికి, ఆగృహలక్ష్మికి?

రేడియో నాటిక

# నైజగుణం

ఏకాంకిక

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

భూ:-నేనే వారిదర్శనం చేసుకొని బతిమాలుకొంటాను.

నా:-ఇదిగో ఏమిప్రమాదం వచ్చినా నాబాధ్యత లేదుసుమండీ! నేను చెప్పవలసిందంతా చెప్పేను.

[డిప్టీ ఇనస్పెక్టరుగారి మకాం గదిలోకి భూషణం వెళతాడు.]

డి. ఇ:-దేనికయ్యా వచ్చేవు భూషణంగారూ!

భూ:-తమ దర్శనం ——

డి. ఇ:-ఎందుకు! నేనే నీదర్శనంకోసం ఈ ఊరు వచ్చేనుకదా!

భూ:-బుద్ధి పొరపాటువచ్చి హెడ్ క్వార్టర్సులో తమ దర్శనం చేసుకొని స్టేటుమెంట్లు తమ చేతికి దాఖలు చేసుకొందామని వెళ్లేనండి. తీరా అక్కడకి వెళ్లేసరికి, ఇక్కడకి తమరు దయచేసేరన్న సంగతివిని గుండె కవుకుంటూ పరుగెత్తుకొని వచ్చేనండి బాబూ!

డి. ఇ:-తిరిగేది మీ సొంత పనులమీద, చెప్పేది మాకోసమని. ఇదీ వరస!

భూ:-అదేమిటండీ బాబూ! అలాగు సెలవిస్తారు!

డి. ఇ:-నువ్వు నీసొంతపనులమీద ఎప్పుడూ తిరుగుతూనే వుంటావుట కదూ?

భూ:-అదేమిటండి అయ్యగారూ! అలాగంటారు. అదెంత మాత్రం నిజం కాదండి అయ్యా!

డి. ఇ:-నువ్వు అలాగు చెప్పకపోతే మరొకలాగు అంటావుటయ్యా!

భూ:-లేదు బాబయ్యా! నామాట అబద్ధమయితే ఈటపా పుస్తకం దయచేసి చూడండి. ఆఫీసులో హెడ్ గుమస్తాగారికి కాగితాలిచ్చి ముద్రవేయించుకొన్నానండి చిత్తగించండి!

డి. ఇ:-(పుస్తకం చూసి) ఈమాటుకి సొంత పనిమీద తిరగలేదేమో! మరి నువ్వు ఎప్పుడూ సొంతపనులమీద తిరుగుతూనే ఉంటావంటారు!

భూ:-ఎవరో కిట్టనివాళ్లు చెప్పేమాటలండి అయ్యగారూ!

డి. ఇ:-ఆసంగతి అలాగుంచు. స్కూలు ట్రాన్స్‌ఫర్ ఆఫ్ మేనేజమెంటు దరఖాస్తు పెట్టుకున్నవాడివి నేను ఎప్పుడో ఒకమాటు హఠాత్తుగావచ్చి స్కూలు దర్శిస్తానన్నమాట ఎరగవూ?

భూ:-(నిర్ఘాంతపోయి చూస్తాడు.)

డి. ఇ:-అదేమిటలాగు వెర్రి వెర్రిచూపులు చూస్తావు సమాధానం చెప్పక.

భూ:-తమరు చెప్పేది నాకేమీ అర్థం కావడం లేదండి. మన్నించండి. నేనేమిటి! బడి ట్రాన్స్‌ఫర్ ఆఫ్ మెనేజిమెంటుకి పెట్టుకోడ మేమిటి అని!

డి. ఇ: నీవుపంపించిన దరఖాస్తులు నీకే మరుపుకి వస్తున్నాయీ ఏమిటి ఖర్మం!

భూ:-తమరు చెప్పేది నాకెంతమాత్రం తెలియడం లేదండి బాబయ్యా!

డి. ఇ:-ఇప్పుడు నీకు తెలియకపోతే రేపు నీచేతికి ఆర్డరువచ్చినప్పుడు తెలుస్తుందిలే దయచెయ్యి!

భూ:-తమరు నన్ను రక్షించాలి! ఇవి చేతులుకావు కాళ్లు! నన్ను రక్షించాలి. నేనువట్టి అమాయకుణ్ణి!

డి. ఇ:-ఈమాటలకేమిలే! ఈకబుర్లు నాదగ్గిర తీసిపారవెయ్యి! ఈపాటికి వెళ్లు. నేను ప్రయాణ సన్నాహంలో ఉన్నాను.

భూ:- తమరు నన్ను —

డి. ఇ:-ఇహా ఇప్పుడు వెళ్లమంటూంటే నీకు కాదుటయ్యా!

భూ:-చిత్తం! సెలవు!

(వెళతాడు)

[శీలశర్మ వాకిటిలో నిల్చుండగా భూషణం వస్తాడు]

భూ:-శీల శర్మగారూ!

శీ:-ఆఁ ఆఁ వచ్చె వచ్చె! ఏమిటి విశేషాలు భూషణంగారూ!

భూ:-నాబొంద విశేషాలు! మీరు మొదట వెళ్లి మన మునసబుగారిని నేను ఒక్కమాటు దయచెయ్యమంటున్నానని చెప్పి తక్షణం తీసుకొనిరండి.

శీ:-అలాగే! కాని మీరొక్కమారు కరణంగారిని పలకరించి చూడలేక పోయారూ!

భూ:-ఇదిగో! ఇప్పుడు ఆపనేచేస్తాను. మీరు మాత్రం వెళ్లి తక్షణం దయచెయ్యమంటున్నానని మునసబుగారినిపిలుచుకురండి!

శీ:-ఇదిగో బయలు దేరుతుంటేనే!

(వెళతాడు)

భూ:-(కరణంగారి తలుపుతట్టి) అయ్యా కరణంగారూ!

[కరణంగారు ఇంటిలోపలనుంచి 'ఎవరువారు'? అంటాడు]

భూ:-నేనూ భూషణాన్ని.

[కరణంగారు ఇంటిలోపలినుంచి "అయ్యా! మీరా! నాకు కొంచెం అర్జంటుపనిగా ఉంది కాని రేపు కలుసుకొందాం" అంటాడు.]

భూ:-నాదీ కాస్త అర్జంటుపని! తలుపు తీయించండి!

[కరణంగారు ఇంటిలోంచి 'క్షమించండి. రేపు తప్పక మాట్లాడుకొందాం' అంటాడు.]

భూ:-మంచిది. (తనలో) నేను పిలవడమేమిటి ఆయన వీలులేదని సమాధానమియ్యడమేమిటి! ఇదేమిటో ఇది! దీని అంతకి ఏదేనా పెద్ద వ్యూహం ఉందా ఏమిటి చెప్మా!

[గ్రామ మునసబు, శీలశర్మ వస్తారు]

భూ:-మునసబుగారూ! దయచేశారా! మీరు అడ్డుపడి రక్షిస్తేనే రక్షించినట్లు లేకపోతే నాకు అరణ్యమే శరణ్యం!

గ్రా. ము:-ఏమిటి వచ్చింది పుట్టిమునక !

భూ:-ఏమిటని నెమ్మదిగా, అడుగుతారు! ఇనస్పెక్టరుగారు నేను బడి మేనేజిమెంటు బదిలీకి దరఖాస్తు పెట్టుకొన్నానంటారు. అదేమిటో నాకు అర్థంగాక చస్తున్నాను. వేళగడిచినకొద్దీ నాకు మతి పోతూంది.

గ్రా. ము:-భూషణంగారూ! నేను చెప్పిన మాట వినండి. మీరు తొందరపడకండి నేను నింపాదిగా కనుక్కొంటాను.

భూ:-ఇంకా తొందరేమిటంటారు, ఒక మూల ప్రాణం పోతుంటే! పాలముంచినా నీటముంచినా మీ దేభారం!

గ్రా. ము:-తొందర పడబోకండి. నేను వెళ్లి కనుక్కొంటానుకదా!

[ఇనస్పెక్టరుగారి మకాంగదిలోకి గ్రామమునసబు వెళతాడు.]

గ్రా. ము: ఇనస్పెక్టరుగారూ! దండాలండి!

డి. ఇ:-ఏమిటి విశేషాలు మునసబుగారూ!

గ్రా. ము:-తమకే తెలియని విశేషాలేముంటాయండి? మా భూషణం ఊరికే కన్నీళ్లు పెట్టుకొని ఏడుస్తున్నాడండి!

డి. ఇ:-ఏడుపుకి కారణమేముంది!

గ్రా. ము:-ఏదో బడి మానేజిమెంటుట! తెలిసి చావద్దేరి అదంతా!

డి. ఇ:-...ను! బడి మేనేజిమెంటు బదిలీకి కాగితం పెట్టుకొన్నాడు.

గ్రా. ము: నిజమే అని తమరు నమ్ముతారా!

డి. ఇ:-అదంతా ఎందుకండి! కాగితం మీకు చూపిస్తాను. మీకళ్లతో మీరే చూసి చెప్పండి.

గ్రా. ము:-చిత్తం చిత్తం!

డి. ఇ:-ఇదిగో భూషణంగారి దరఖాస్తు.

గ్రా. ము:-(దరఖాస్తు చూసి) భూషణంగారూ!

[అవలినుంచి భూషణం అయ్యా! అయ్యా! అంటాడు.]

గ్రా. ము:-ఒక్కమాటు ఇలాగురండి!

[అవలినుంచి భూషణం 'వస్తున్నా' అంటూ గది లోకి వస్తాడు.]

గ్రా. ము:-ఇదిగో భూషణంగారూ! మీరు పంపిన దరఖాస్తు. ఇంకా మీకు సందేహమా!

భూ:-(చూసి) నేనుపంపడమేమిటి! దరఖాస్తులేమిటి!

గ్రా. ము:-మరి మీరే ఆలోచించండి ఎలాగు వెళ్లేమో!

భూ:-నాకేమీ ఆలోచన పోవడం లేదు మునసబుగారూ!

గ్రా. ము:-ఇది మీసంతకమా నంటూరా, కాదంటూరా?

భూ:-ఇది నాదికాదండి అయ్యా! కావలిస్తే తక్కిన వాటితో తైపారుసు చేసి చూడండి. ఇదిఫోర్జరీబాబూ! ఇనస్పెక్టరుగారూ!

డి. ఇ:-ఆఁ ఫోర్జరీయే!

భూ:-ఫోర్జరీయేనండి బాబూ!

డి. ఇ-అంతా చిత్రంగా ఉందే!. ఫోర్జరీ అయితే ఎవరు చేసినట్లు? ప్యూన్!

[బంట్రోతు వస్తాడు]

బంట్రో:-చిత్తం అయ్యగారూ!

డి.ఇ:-నువ్వు కరణంగారిని, నాగారావుగారిని పిలుచుకురా తక్షణం.

బంట్రో:-చిత్తమండి.

(వెళతాడు.)

డి. ఇ:-బహు విచిత్రంగా ఉందే. అనుకొన్న దొకటి అయినదొకటినా ఏమిటి చెప్మా!

[కరణం, నాగారావు వస్తారు.]

కర; నా:-దండాలండి.

డి. ఇ:-మంచిది. కరణంగారూ! ఇలాగు కూర్చోండి, నాగారావూ!

నా:-అయ్యగారూ!

డి ఇ:-ఈదరఖాస్తుమీది సంతకం ఎవరిది?

నా:-మా మేనేజరు భూషణంగారిదే నండి బాబూ!

డి. ఇ:-ఇదిఫోర్జరీట!

నా:-ఏమోనండి. నాకావిషయం తెలియదు. అంతా భూషణంగారి మహిమే! ఆయన ఏదేనా ఆఫీసుపని చెయ్యమంటే చెయ్యడమే నావంతు.

డి. ఇ:-ఏమండీ కరణంగారూ!

కర:-అయ్యా!

డి. ఇ:-భూషణంగారు నాగారావు పేరట బడిని బదిలీ చేస్తారట అని మీరు నాతో చెప్పేరుకాదూ!

కర: అదంతా నాగారావుగారు చెప్పిన మాటేనండి. ఆబదిలీ సందర్భంగా మూడువందల రొక్కం కూడ వసూలు చేసేదన్న సంగతి నాగారావుగారే నాతో చెప్పేరు.

భూ:-శివ శివ!

డి. ఇ:-మీరు కాస్తసేపు ఊరుకోండి భూషణంగారూ! ఏమయ్యా నాగారావూ! నీవు కరణంగారితో అన్న మాట వాస్తవమేనా?

నా:-ఏమోనండి అయ్యగారూ!

కర:-ఇదిగో —

డి. ఇ:-మీరుకాస్తసేపు ఊరుకోండి కరణంగారూ! అయితే కరణంగారు అబద్ధ మాడేరంటావు. అంతేనా?

నా:-నన్నేమి చెప్పమన్నారండి!

కర:-చాలా పెద్దమనిషివిలే! నాకు నువ్వు కాదుటయ్యా చెప్పేవు. లేకపోతే నాకీ సంగతులన్నీ ఎలాగు తెలుస్తాయి.

డి. ఇ:-ఇంకా నాగారావు ఏమి చెప్పేడు కరణంగారూ!

కర:-వీడో ఒక స్వవిషయం చెప్పేడులేండి! దీనిని బట్టి చూస్తే అదీశుద్ధ అబద్ధమనే తోస్తూందండి.

డి. ఇ:-చెప్పడానికి మీకు అభ్యంతరం లేక పోతే మాతో కూడ చెప్పండి.

కర:-ఏమంత పెద్దసంగతి కాదులేండి. చెప్పినా ఫర్వాలేదు. నేను ఊళ్లో వాళ్లందరిని బాధిస్తున్నానని భూషణం

గారు అన్నిచోట్లా చాటిస్తున్నారని నాగారావు చెప్పేడు!

భూ:-రామ రామ!

డి. ఇ:-ఏమండి మునసబుగారు భూషణం గారు ఊళ్లో చెప్తున్నట్లు మీరు విన్నారా?

గ్రా. ము:-నా ఎరికకదేమీ రాలేదండి అయ్యా!

కర:-అదంతా ఉత్తదే అన్నమాట! మాలో మాకు తగాదాలు పెట్టడానికి వేసిన ఎత్తన్నమాట. సరి! దానిజోలి మనకెందుకులెండి ఇనస్పెక్టరుగారూ!

డి. ఇ:-సరేలెండి. ప్రస్తుతం పని- ఈదరఖాస్తు విషయమై నిజం చెప్పు నాగారావ్రూ!

నా:-లేదు అయ్యగారూ! నిజమేనండి!

డి. ఇ:-నువ్వు నిజం చెప్పితే శిక్ష కొద్దిలోనే పోతుంది. లేకపోతే చాలవరకు వెళు తుంది.

నా:-(ఊరుకొంటాడు.)

డి. ఇ:-ఏమాటా నాకు నోటితో చెప్పు.

నా:-ఏదో బుద్ధిగడ్డితిని అప్పుడు చేసేనండి.

కర:-ఓరి దుర్మార్గుడా! స్వామిద్రోహి ఎంతపని చేసేవు! నన్నా నమ్మించేవు. మీ మేనేజరుకా ద్రోహం తలపెట్టేవు. ఇనస్పెక్టరుగారికా శ్రమ ఇచ్చేవు. ఛీ ఛీ! నీమొహం చూడకూడదు.

డి. ఇ:-అలాగుండండి కరణంగారూ!

గ్రా. ము:-ఇనస్పెక్టరుగారూ! నా మనవి ఒకటుంది కాస్త ఆలకిస్తారా?

డి. ఇ:-ఏమిటో చెప్పండి మునసబుగారూ!

గ్రా. ము:-నాగారావు ఏదో బుద్ధిగడ్డితిని చేసేనని ఒప్పుకొంటూనే ఉన్నాడు. కాబట్టి పొట్టమీదకొట్టవద్దని నామనవి. అతన్ని రక్షించవలసిన బాధ్యత తమది.

డి. ఇ:-అంతా కాగితాల మీద ఉండగా ఎలాగు రక్షించనండీ! వ్రాత బలికోరు తుందని సామెత.

గ్రా. ము:-ఆ సూత్రమూ తమరే సెల వియ్యాలని మాకోరిక.

డి. ఇ:-అసలు మొదటిలో ఇటువంటి దుర్మార్గుడు మా రేంజిలో ఉంటే మాకపకీర్తి. ఇంకముందు మా రేంజిలో పనిచెయ్య కూడదు.

గ్రా. ము:-ఏదో ఇహా తమరు కటాక్షించాలని మనవిచేసుకొంటూనే ఉన్నాను కాదూ!

నా:-పిల్లల వాడినండి బాబయ్యగారూ! తమరే నాకు తండ్రులు. తమ బిడ్డలం మేము. రక్షించాలి.

డి. ఇ:-ఇహా ఇది తప్పేటట్లులేదు. మొదట ఈబడి మేనేజిమెంటు బదిలీనాకు అక్కర లేదంటూ ఏవో కొన్ని కారణాలు రాసి ఒక పిటీషన్ నాపేర ఇయ్యి.

భూ:-ఇట్లాంటివాడు నాబడిలో పని చెయ్యడం నాకెంత మాత్రమూ ఇష్టం

లేదండి ఇనస్పెక్టరుగారూ! తమరేమన్నా సరేగాని!

డి. ఇ:-అయితే నన్నేమి చెయ్యమంటారు భూషణంగారూ!

భూ:-మాస్కూలు నుంచి రిజైన్ పెట్టుకోమని చెప్పవలసిందని ప్రార్థిస్తున్నాను.

డి. ఇ:-అతనేమంటాడు?

నా:-తమరిష్టమేనండి అయ్యగారూ!

డి. ఇ:-నా ఇష్టమేమిటి మధ్య మీమేనేజరు ఇష్టము, నీ ఇష్టము.

భూ:-నా ఇష్టము ఇదివరకే మనవి చేసుకొన్నాను.

నా:-మీ బడినుంచి రిజైను దాఖలు చేసుకొంటానండి భూషణంగారూ!

డి. ఇ:-మాటలతో కాలక్షేపం చెయ్యవద్దు. నేను మళ్లీ ఊరికి పోవాలి. ఎవరి కాగితాలు వారికి రాసి ఇచ్చెయ్యి.

నా: చిత్తమండి. (కలం కాగితాలు తీసి రాస్తాడు.

డి. ఇ:-భూషణంగారూ! మీబడిలో ఎటువంటి ప్రబుద్ధుణ్ణి చేర్చేరో చూశారండి. మాకాశ్రమ, మీకాశ్రమ, ఊరిపెద్దలకాశ్రమ!

కర, గ్రా. ము:-మాకుశ్రమేమిటిలెండి! మీమాటే తలుచుకొని బాధపడుతున్నాం.

భూ:-నాబోటి అజ్ఞానుడిమీద ఎన్నివాదులు వచ్చినా తమ దయుంటే సూర్యరశ్మికి మంచు తెరలు విడిపోయినటుగా విడిపోతాయి.

కర, గ్రా. ము:-మేము మనవి చేసుకొనేది తమ దయే!

డి. ఇ:-ఏపనిలోనైనా ఎవరినైజగుణం వారు కనబరచుకోక మానరు. అది మీకందరికి తెలిసిన విషయమే!

(తెరవాలుతుంది.)

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

—(o)—




(గతసంచిక తరువాయి)

గాఢాంధకారం, నిశ్శబ్దదేవత జగమంతా వ్యాపించింది. పశుపక్ష్యాదుల కిలకిలా రవాలన్నీ సమసిపోయినై! ఇంకా చంద్రోదయం కావటానికి రెండుమూడు గంటలు పడుతుంది. ఆ చీకట్లో యిద్దరమూ బిక్కుబిక్కుమంటూ కూర్చున్నాము. యశోధరుడు యిలాంటివి బాగా అలవాటేగాని నాదీనావస్థజూచి అతడు జాలిపడుతున్నాడు.

'శ్రీధర్! నువ్వు యింటికివెళ్తే మీ అత్త తన్నదుట్రా!'

'అందుకేంజేస్తాం!'

కాసేపు మౌనంగా వూరుకున్నాడు యశో!

'నేనొక కథ చెప్తా వింటావుట్రా! కథకాదులే జరిగిన సంగతే!' నన్నాడు యశో!

'సరేచెప్పు!' అన్నా యీ విధంగానైనా కొంత కాలం గడుస్తుందిగదా అని!

'భూతాలను నువ్వెప్పుడన్నా చూశావురా! అవి నల్లగా వుంటాయి! కొరివిదయ్యాలుంటాయి! నేను వాటి నప్పుడప్పుడు చూస్తుంటాను!' అన్నాడు.

భూతాలనేటప్పటికి నాకొక విధమైన భయం కలిగింది. కాని నాకు నిజంగా భూతాలున్నాయంటే నమ్మకం కలగటంలేదు!

'నిజంగా నువ్వు చూశావుట్రా!' అని అడిగాను!

'ఆ! చాల తడవలు చూశాను!'

'అవ్వేం. చేస్తాయి!' అన్నాను అమాయికంగా!

'మనుష్యులకు భయం కలిగిస్తాయి! వాళ్లను తీసుకొనిపోయి గోతుల్లో పడేస్తాయి! అనేకమైన బాధలు పెడతాయి. ఒక్కొక్కప్పుడు గొంతునులిమిచంపేస్తాయిగూడా!'

'అబ్బా! అంతపని చేస్తాయా!'

'మరేమనుకున్నావు! నల్లగా వుంటాయి! గ్రుడ్లు చింతనిప్పుల్లాగా వుంటాయి; కోరలుంటాయి! చేతిగోళ్లు పదునుగా వుంటాయి! కాని అవి నిప్పునుచూస్తే పారిపోతాయి!'

నాకు నిజంగా భయం కలిగింది. యిప్పుడేదన్నా దయ్యంవస్తే!- నావళ్లు వణికింది. ఎదురుగుండా నల్లగా చింతనిప్పుల గ్రుడ్లతో వస్తున్నట్లనిపించింది. 'అమ్మో!' అనుకున్నా! దగ్గరకు వచ్చినట్లుంది. గొంతు నులుముతుంది. 'ఆ! అ! అబ్బా!' అన్నాను.

'ఏమిటేమిటి' అన్నాడు యశోధర్ ఆదుర్దాగా!

'ఏమీ లేదేమీ లేదని లేచి కళ్లు నులుముకొని చూశా' నిజంగా ఏమీలేదు. మరిందాక కనబడిన ఆకృతి! ఏమో! మనం ఎలా అనుకుంటే అలా వస్తాయంటారు! పట్టి మిథ్యాభావన అనుకున్నా! కాని దగ్గర నిప్పుపెట్టెన్నావుంటే బాగుండేది! కానిలేదు!

కొంతసేపయిం తర్వాత మళ్లీ అతనన్నాడు.

'నీకు భయం పుడుతుందా!'

'లేదు!' అని మాత్రం అనగలిగా! లోపల ఏదో ఒక విధమైన భయం పీకుతోనేవుంది.

'మరిందాకెందుకు ఉలిక్కి పడ్డావు!'

నేనేమీ సమాధానం చెప్పలేదు!

మళ్లీ మొదలు పెట్టాడు.

'ఒకతను యిలాగే అర్ధరాత్రప్పుడు ఒక అడవి గుండా నడచిపోతున్నాట్ట! కొంతదూరం పోయే సరికి కాలికేదో గట్టిగా తగిలిందట! ఏదోలే అని దాటిపోతున్నాడట. కొంత దూరం పోయేసరికి తన వెనక ఏదో చప్పుడయిందట. వెనక్కి తిరిగిచూస్తే యిందాక కాలికి తగిలిన గట్టి నల్లని పదార్థంలాగనే కనబడ్డదట! కాసేపటికి మిణుకు మిణుకుమంటూ ఎఱ్ఱగా నిప్పుకణాల్లా కళ్లు కనబడ్డాయి. ఆయనకు భయంపుట్టి పరుగెత్తబోయాడు. అటువైపు కనిపించింది. మళ్లీ దగ్గరకువచ్చి ఏదో అస్పష్టపు సంభాషణ చేసిందట! అతను మాట్లాడవలచినా మాట పెకిలిరాలేదు. అతని నెక్కడికో తీసుకువెళ్లిందట! ఎలా వెళ్లాడో ఏమో! మధ్య మధ్య చెట్లుకొట్టుకొని, ముళ్ళు గ్రుచ్చుకొని బాధపడ్డాడు. ఆ దయ్యం చెట్లులో పల్నించి ప్రయాణం చేసిందట! కొంత సేపటికి అలాంటివే మరికొన్ని కనిపించాయట! యిది దయ్యాల రాజ్యమేమో ననుకున్నాడతను. చంపుతాయని భయపడ్డాడు. అవన్నీ అతని చుట్టూ తిరిగి ఏదో వాటి భాషలో మాట్లాడినాయట! అతనికేమీ తెలియలేదట! తనెక్కడున్నదీ ఏంచేస్తున్నదీ అర్థంకాలేదు. అలా ఎంతసేపు వాటిమధ్య వున్నాడో ఏమో! తెల్లవారేసరికి యిసక దిబ్బల మీద దుమ్ముకొట్టుకొని, గాయాలుతగిలి పడి వున్నాడట! ఇది నిజంగా జరిగిందే తెలుసా! ఆయనే ఎవరికో చెప్పాడట యీ సంగతంతా! అవి మంచి దయ్యాలు కాబట్టి చంపకుండా విడిచి పెట్టాయి!' అన్నాడు.

నేనొక్క నిట్టూర్పు విడిచాను. ఎదురుగా ఏదో నల్లగా కనబడుతున్నది. కదిలిరావటంలేదుగదా అనుకున్నాను. ఇందాకటినుంచి అది దయ్యమేమోనని భయంపుడుతున్నది, యీ మాట యశోతో చెపుదామనుకున్నాను. కాని ఏమనుకుంటాడోనని చెప్పలేదు. ఏదో అక్కడ కదిలినట్లనిపించింది. నా అనుమానం రెట్టించింది.

'యశోధర్! అటుచూడు. అది దయ్యమేమో!' అని అన్నాను భయపడుతూ!

యశో కాసేపు నిదానించిచూచి 'అలాగే కనబడుతుంది. కదలటంలేదు! ఇది మంచి దయ్యం అనుకుంటూ! ఏమీ హాని చేయదులే! భయపడకు!' అని తన ధైర్యాన్ని ప్రకటించాడు. బిత్తరపోయి యశోవైపు అటువైపు చూస్తూ నిలుచున్నాను.

చంద్రుడు మెల్లమెల్లగా సముద్ర గర్భంలోంచి చిక్కి సగమై బైటికొస్తున్నాడు. చిన్న వెలుగు కిరణాలు భూమిమీదపడుతూ తమనిజ స్వరూపాలను తెలియజేస్తున్నాయి. యశోధరులేచి 'బయలుదేరు' అన్నాడు. యిందాకటివైపు చూచాను. ఏదో గుట్టగా కనుపించింది. దగ్గరకు వెళ్లాము. అదొక పొద. 'పొదనుచూచి దయ్యమని భయపడ్డాము!' అని అన్నాను. 'కాదు! యింతాకటినుంచి దయ్యమే వుండి వుంటుంది. వెన్నెల రావటంతోటే మాయమైపోయింది' అన్నాడతను. 'అవును గామాలు' అనుకొన్నా మనస్సులో! వృద్ధిపొంది పరుగెత్తుకొస్తున్న చంద్రుడినిచూచి ఆనందంతో!

♦ ♦ ♦

చిన్నతనంలో దృఢమైన గాఢమైన అభిప్రాయాలు నాటుకుపోయినట్లయితే అవి జీవితాంతంవరకూ మరచిపోవటానికి శక్యం కాకుండా వుంటాయి. పసితనంలో హృదయాలు కోమలంగా మృదుత్వం గలిగి వుంటాయి. ఏబీజాలను ఆ హృదయ క్షేత్రం మీద నాటుతామో అవే అభివృద్ధిపొంది పూలు పూచి వెల్లివిరుస్తాయి. సుగుణ దుర్గుణాలుగాని, నీతి అవినీతులుగాని విద్య అవిద్యలుగాని చిన్నతనంలోనే ఎక్కువగా అలవాటుపడతాయి. హృదయ ఫలకంమీద ప్రతిబింబించేరూపం నిత్యమౌతుంది, దాన్ని తుడిచివేయటానికి శక్యంకాదు. ఆ లేత

హృదయాలు గాఢమైన విఘాతాలకు ఓర్చుకోలేవు. కొన్నికొన్ని వాడి మోడువారి నశించిపోతాయి. కొన్నిఎండి బీటలువారి కరుడు గడతాయి. ఆ మనస్సులను త్రిప్పటానికిగాని వాటిని సరైన త్రోవలో పెట్టటానికిగాని శక్యంకాదు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. కాని వివిధ పుష్పాల పరిమళం వివిధ రకాలుగా నుంటుంది. కొన్ని మనోహ్లాదకరమైన సువాసననిస్తాయి. కొన్ని వాసన లేనిపూలు. కొన్ని వాసన చూడటానికి శక్యం కాకుండా తలనొప్పి కలిగించేవిగా వుంటాయి! ఇలాంటి వాటిలో మొదటిరకం దోహదం అవసరం లేకుండానే తనున్నానని నిరూపించుకోగలదు. రెండవరకం వాసనలేనిపూవు కంటికాకర్షణీయంగా వుంటుందికాని మనోహ్లాదకరం కాలేకపోతుంది. అంతా కళ్లతోచూచి ఆనందించేవారేగాని తనకు వాళ్లదగ్గర స్థానంలభించదు. మూడోరకం తనున్నానని తెలియజేసుకోటానికి అటువైపు ఎవ్వరూ తొంగి చూడరు. అందువల్ల పూచి నశించటమేగాని దాని వల్ల ఉపయోగంలేదు. ఇలాగే మానవజీవితాలలోను సజ్జనుడు పరిమళభరితమైన పుష్పంలాంటివాడు. తానొరుల దగ్గరికిపోనక్కరలేదు. వారినే తనదగ్గర కాహ్వానించే శక్తి అతనిలోవుంది. రెండవరకం తామరాకుమీది నీటిచుక్కలాగా అంటీ అంటనట్లుంటాడు. ఇతరుల నాకర్షించేవాడైనా తనశక్తిచేత వారి కుపయోగపడేవాడుకాదు. అధముడు, దుష్టుడు మూడోరకం. అతనిదగ్గరికి చేరటానికే భయపడతారు. భీతిగొల్పేగుణమేతప్ప ఆహ్వానించటానికి తగినగుణమాతని దగ్గరలేదు. యిలాంటి వింతప్రకృతులుగల మానవులలో దుష్టునివల్ల ఎక్కువహాని కలుగుతుంది. సజ్జనసాంగత్యం సాధుసంగమంలాంటిది! జీవితసముద్రంలో నడచే నౌకకు రక్షకభటులు వీళ్ళే! నౌకదరిజేరటానికి వీరిసహాయం అత్యవసరం!

పుస్తకాలు, పలకాబలపం దగ్గరపెట్టుకు కూర్చున్నాను చదువుకోవటానికి. నాపరిస్థితి ఆలోచించేటంత శక్తి నాకిప్పుడున్నంత అప్పుడెలావుంటుంది? వేళకువస్తే నాలుగుమెతుకులు దొరికేవి. లేకుంటే ఆరోజు ఉపవాసమే! నా అత్తకొడుకులున్నారు గోపి, రఘు. నాకంటే వయస్సులో చిన్నఅయినా నన్నుమాటిమాటికీ జుట్టుపీకి గందరగోళం చేస్తుంటారు. నా పుస్తకాలు పలక ఏవూరుపోతాయో తెలీదు. వాటిని వెతుక్కొని కూర్చుండేటప్పటికి నేను చదువుకుండే పగిలిపోయిన గుడ్డిదీపంగూడా ఎవరికో ఒకరికి అవసరమౌతుంది. ఇంక చదువుకు స్వస్తి.

ఒకరోజు గోపి నాపలకపగలగొట్టాడు. నాకు పట్టరానంతకోపం వచ్చింది. వాడిని కొట్టబోయాను. గోపి తప్పించుకుని తల్లిచాటుకుపోయి నామీద కొండేలుచెప్పటం మొదలుపెట్టాడు. ఆమెవచ్చి నా వీపుమీద నాలుగువడ్డించింది. 'పలక జాగ్రత్తపెట్టుకోవటం చేతగాక పగలగొట్టుకొని పైగా వాడు పగలగొట్టాడని చిన్నవాడిమీద చేయిచేసుకోపోతావ్. యీ తడవ వాడిజోలికిపో! నీకాళ్లిరగగొడతా!' నంటూ కోపంతో రుసరుసలాడుతూ పోయింది. నాకు ఆపుకోలేని దుఃఖమూ, కోపమూ మిళితమై వచ్చాయి. ఏంలాభం. 'పేదవానికోపం పెదవికి చేటు! దుఃఖం మనశ్శాంతి కాధారం' అనుకొని బిగ్గరగా ఏడ్చి వూరుకున్నాను. నాసంగతి ఎవరికి కావాలి. వాళ్లు చెప్పిందల్లా 'ఊ! ఆ! అనకుండా చేయాలి. సెలవురోజుల్లో గొడ్లను తోలుకుపోవాలి. యింట్లో జీతగాడి చాకిరీ అంతా చేయాలి. నాసంగతి, నా జీవితం సంగతి, నా భావిజీవితం ఎలా వుంటుందో ఊహించుకుండేపాటిశక్తి నాలోలేదప్పుడు. నాకు తెలిసిందల్లా ఏపనిచెపితే అది మారుమాట్లాడకుండా చేయటం. దెబ్బలుకొడితే పడుండటం! యీదెబ్బలతో నాశరీరం మొద్దుబారింది. వాళ్ళ కోపానికి నాశరీరాన్ని స్థానంగా యిచ్చాను. సాధక బాధకాలన్నీ దానివేకాని నావి కావనుకున్నాను. అప్పటి నాశరీరం కఱ్ఱదెబ్బలకు గూడా నోచుకుంది! ఎంత ధన్యాత్మురాలో!

ఆరోజు పుస్తకం చించినందుకు గోపీని, రఘుని యిష్టమొచ్చినట్టు తన్ని యశోధరతో కలిసి కొండ మీదికి పారిపోయొచ్చాను. ఆనాడింటికి పోయిం తర్వాత ఆయింట్లోవున్న అందరి జతల చేతులూ నా నెత్తిన వీపుమీద ఎక్కడపడితే అక్కడ వీరవిహారం చేసినై! అత్త కఱ్ఱతో నెత్తినబాదింది. గాయమై నెత్తురు చిమ్ముతున్నా లక్ష్యపెట్టలేదు. దెబ్బలకు వళ్లువాచింది. ఎక్కడ పడుకున్నానో ఏమో పెద్దక్క వచ్చి లేవదీసిందాకా పడివున్నాను, జీవచ్ఛవం లాగా! ఆమె మాఅత్త పెద్దకోడలు! 'సుభద్ర!' ఆమెను కావలించుకోని గట్టిగా ఏడ్చాను. ఆయింట్లో నన్ను దయతో జాలిగాచూచేది ఆమె ఒక్కతే! తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని నేను ఆమెనే తల్లి, దండ్రీగా భావించుకోని ఒక్కొక్కప్పుడు 'అమ్మా' అని ఒక్కొక్కప్పుడు 'అక్కా' అని పిలిచేవాడిని! సుభద్ర ఎప్పుడూ నాకళ్లల్లోకి జాలిగాచూచేది! ఆ చూపుల్లో నిండివున్న అపారమైన కరుణ నాకర్థమయ్యేదిగాదు. ఆచూపులు నా హృదయభారాన్ని కొంతవరకు ఉపశమింపజేసేవి. ఎక్కడెక్కడో తిరిగివచ్చి అన్నం నీళ్లూలేక గొడ్ల పావిట్లో పడుంటే యింట్లో అంతా నిద్రపోయిం తర్వాత నన్ను వెతుక్కుంటూవచ్చేది. నాకప్పుడు నాతల్లి యీమె - రూపంలో వచ్చిందని ఆనందంతో కౌగలించుకోని ఏడ్చేవాడిని. సుభద్ర వల్లే యీయింట్లో యింతకాలంనుంచీ వుండగలుగుతున్నా ననుకోవటంలో ఆశ్చర్యమేమీలేదు! ఆమె నొక కరుణామూర్తిగా దేవతగా భావించేవాడిని! అలసిసొలసి నిద్రపోతూన్న నన్ను తన చల్లనిచేతుల్లో లేపి నీళ్లుపోసి అన్నంపెట్టేది. ఆమెమీద నాకధిక గౌరవం ఏర్పడింది. అక్కడ యశోధర్ తల్లి అభయ నన్ను తనకొడుకుగా భావించేది. నేనప్పుడప్పుడు నాకు తగిలినదెబ్బలు వాళ్ళఘోరకృత్యాలు అన్నీ ఆమెతో చెప్పుకుని ఏడ్చేవాడిని. ఆమె ప్రేమతోనన్ను తన ఒడిలోకి తీసుకోని కన్నీరుతుడిచి బుజ్జగించేది! వీరిద్దరిని సుభద్ర అభయలను దేవతలగా భావించాను! వారిద్దరు నాతల్లిదండ్రులే ననుకున్నాను, వీరిలో నాతల్లి యెవరో తండ్రి ఎవరో నిర్ణయించలేకపోయేవాడిని! యశోధరు నా అజన్మ సోదరుడని భావించేవాడిని. ఒక్కొక్కప్పుడు వాళ్లింట్లోనే తిని అక్కడ నిద్రపోయేవాడిని. వీరు ముగ్గురే నాకు జీవితంలో అనాయాచితంగా దొరికిన ఆధారాలు. ఈ కష్టాలన్నీ భరించలేక చావాలనుకుండేవాడిని. కాని చావంటే ఒకవిధమైన భీతిగలిగింది. అయినా నేను చనిపోతే దుఃఖించేవారెవరు? దుఃఖోపశమనానికి రాత్రిళ్లు ఏకాంతంగా నిర్జన ప్రదేశాల్లో తిరిగేవాడిని. యశోధరు వచ్చినప్పుడు ఏపని చేస్తున్నా సరే అది వదలిపెట్టి పరుగెత్తుకు పోయేవాడిని. అందువల్ల ఏలాగూ దెబ్బలు వ్రాసివున్నాయిగదా అని ఆసంతోషంలో వాటిని లెక్క చేసేవాడిని కాదు.

పుస్తకం తెరిచానో లేదో ఎక్కడ నుంచో ఊడిపడ్డారు గోపి, రఘు యిద్దరూను! గోపి రావటంతోటే పుస్తకం నేలకేసి విసిరికొట్టాడు. రఘు నెత్తినెక్కాడు.

"మహాచదివేవాడివిలాగా పుస్తకాలు పెట్టుకు కూచున్నావ్! ముఖం పుల్లలు కోయలేదేం!" అన్నాడు అధికారం చలాయిస్తూ గోపి! ఇదంతా తల్లియిచ్చిన అధికారం, నేను వాళ్లకంట్లో ఒక నలుసును! అమ్ముడు పోయినగొడ్డును, నాఅత్త నన్ను కొట్టటంచూసి వీళ్లు నన్ను మరీ బాధించసాగారు. వాళ్లు అడిగినవి యివ్వాలి, చెప్పినపని చెయ్యాలి, లేకపోతె లేనిపోని కొండేలు చెప్పి తల్లిని నామీదకు దండయాత్రకై పంపిస్తారు. అస్త్ర శస్త్రాలులేని రధికుడిని హతమార్చటానికి ప్రయత్నించే ఆడ సింహంలా గర్జిస్తూ నామీద కురికేది. నేను నోరెత్తేవాడిని కాదు.

"ఊఁ! యింకా కూర్చున్నావేం! చెట్టెక్కి పుల్లలు కోస్తావా! అమ్మతో చెప్పమన్నావా!" అన్నాడు మళ్లీ గోపి!

ఆమె అనేటప్పటికి, నాలో ఒకవిధమైన భయం ఆవరించింది. ఆమెదర్శనం నాకొక రాక్షసిదర్శనంలాగయింది. యీమకన్న దయ్యాలే మంచివిలాగున్నాయి. కొట్టకుండా తిట్టకుండా ఎక్కడికో తీసుకుపోతాయి అని అనుకుండేవాడిని. అప్పుడప్పుడు యింట్లోనుంచి పారిపోయేవాడిని. కాని ఎంత కాలం! సాయంత్రం అయ్యేటప్పటికి ఆకలి దహించుకుపొయ్యేది. విధిలేక యింటికివచ్చి వంతు ప్రకారం అనుభవించేవాడిని.

ఒకరోజు యింట్లోచెప్పకుండా మళ్లీ రాకూడదనే స్థిరసంకల్పంతో బయలుదేరి పొలాలు గుట్టలు అన్నిదాటి పోయాను. ప్రొద్దుగ్రుంకిం తర్వాత ఒక తోటలో ఏవోపచ్చికాయలు కోసుకొని తిని కాలువలోని నీళ్లుత్రాగి యిసుకదిబ్బలమీద పడుకున్నాను. నాకు సుభద్ర గుర్తుకొచ్చింది. ఆమె నన్ను ఆదరించటం, అన్నంపెట్టడం అన్నీగుర్తుకొచ్చి కన్నీళ్లు విడిచాను. తర్వాత అభయ, యశోదరులు గుర్తుకొచ్చారు. నన్ను వెతుక్కుంటూ యశో వస్తే, నేనుకనబడక ఏంచేస్తాడోనని అనేకరకాలుగా ఆలోచిస్తు పడుకున్నాను. నాతల్లిదండ్రులు ఆజన్మ సోదరుడు అక్కడుండగా వారిని విడిచిపెట్టిరావటం వారికి ద్రోహంచెయ్యటమని తలచాను. వాళ్ళనుచూడాలని మనసాందోళనచెందింది. అక్కడవుండలేకపోయాను, లేచాను. కాళ్లుతడబడుతున్నాయి. కాలువగట్టునే నడచిపోతున్నాను. ఎంతదూరంనడిచానో ఏమో! తెల్లవారేసరికి వూరుసమీపంలో వున్నాను. అప్పుడే యశోధరుడు కాలువలోదిగి యీతగొడుతున్నాడు. నన్నుచూచి గబగబా బైటికొచ్చి "ఎక్కడున్నావ్, ఎక్కడికిపోయావ్" అన్నాడు. నాసంగతంతా చెప్పాను. వెంటనే యిద్దరం యశోయింటికివెళ్లాం. రాత్రంతా నిద్రలేకపోవటంవల్ల కళ్లుచింతనిప్పుల్లాగ వుండి మండిపోతున్నాయి. వళ్లు తేలిపోతుంది. అభయ స్నానంచేయించి భోజనంపెట్టి, పరుండబెట్టి ఒళ్లునిమురుతూ నాకళ్ళలోకి జాలిగాచూసింది. నామీద వీళ్ళకింత అవ్యాజమైనప్రేమ ఎలాకలిగిందో నాపూర్వజన్మ సుకృతమనిపించింది. ఆమెకు నమస్కరించాలని బుద్ధిపుట్టింది. కాని ఆపనిచేయలేకపోయాను. అలసివుండటంచేత బాగా నిద్రపట్టింది. లేచేసరికి నాచుట్టూ గోపి, రఘు, యింకా కొంతమంది పిల్లలు మూగివున్నారు.

'అమ్మరమ్మంటున్నది. ప్రొద్దుటినుంచీ ఎక్కడ దాక్కున్నావ్! యివ్వాళ నీపెళ్లవుతుందిలే పద!' అన్నాడు గోపి! నాకు పిచ్చెత్తినట్లయింది. నన్ను మళ్లీ ఆనరకకూపంలోకి లాక్కుపోయారు! వెంటనే నా మృత్యుదేవత ఎదురుగా వచ్చింది.

'పని చెయ్యకుండా పారిపోదామనుకుంటే నీ అబ్బగాడెవడు చేస్తాడనుకున్నావు యీ చాకిరీ అంతా - దున్నపోతులాగా మేపటానికా నిన్నుంచుకున్నది.' అని నాలుగు వడ్డించింది. 'ఈసారి యిలా పారిపోయావా స్తంభానికి విరగట్టి వాతలుపెడతా! నువ్వెక్కడున్నా పట్టితీసుకొస్తా తెలుసా!' అని హూంకరించి వెళ్లిపోయింది యిలా నా ప్రయత్నాలన్నీ వ్యర్థమైపోయినై!

◆ ◆ ◆

రఘు జుట్టుపీకుతున్నాడు. గోపి 'పీకు! బాగా పీకు! జుట్టు ఊడిరావాలి' అంటున్నాడు. 'లేస్తావా లేవ్వా! అమ్మని పిలుస్తానుండు! - అమ్మోయ్!' అని కేకవేశాడు గోపి! నామీద పిడుగు పడ్డట్టయింది. లేచి పరుగెత్తుకెళ్లాను వేపచెట్టు దగ్గరికి గోపి, రఘులు ఎగతాళి చేస్తూ నన్ననుసరిస్తున్నారు.

ఆచెట్టు ఎక్కటం చాలకష్టం. కొంత ఎత్తువరకూ ఏమీ ఆధారం లేకుండా సాపుగా వుంది. పొట్టను చెట్టుకానించి చెట్టుపాకుతుంటే నావళ్లంతా దోక్కుని పొయ్యేది. మంటలు పుట్టేవి. చెట్టు మొదట్లోనుంచుని ఏవో పుల్లలు కోసి క్రిందపడేశాను.

(సశేషము)

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది - కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కేబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



బిడ్డల ఆరోగ్యమునకు

ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్,
బరంపురము (గంజాం), బొంబాయి.






## మామిడికాయహల్వా

పచ్చిమామిడికాయలు పైచెక్కుతీసి, తరిగికాని, లేక తురిమికాని, తూచవలెను. ఒకసేరు మామిడి తురుముకు, ఒకసేరు పంచదార కావలెను. గిన్నెలో నీళ్ళుపోసి పైనగుడ్డకట్టి దానిమీద మామిడి తురుము వుంచి, ఆవిరిమీద బాగా వుడికించవలెను. తరువాత పంచదార బాగాముదురు పాకుచేసి, ఈవుడికిన తురుమును అందులో వేయవలెను. వేసిన తరువాత మరల కొద్దిగా వుడికించవలెను. బాగా వుడికిన తమపరి క్రిందకు దించి సువాసనకు కొద్దిగా యాలకుల పొడి వేయవలెను. కుంకుమపువ్వు కూడ వేసినబాగుండును. ఇదేరకముగా అల్లముక్కలూ వుసిరికాయముక్కలూ కలిపి తయారుచేయ వచ్చును. ఇదిపత్యానికి చాలా వుపయోగించును. ఈరెండును బాగాచల్లారిన తరువాత వెడల్పు మూతిగల సీసాలోగాని లేక జాడిలోగాని వుంచవలెను. సంవత్సరము దాక నిలువవుండును. మామిడిహల్వా రొట్టెలతో పూరీలలో నంచుకొనుటకు చాలా రుచికరముగ నుండును.

టి. కృష్ణవేణి

## బీరకాయచెక్కుపచ్చడి

సామాన్యముగా కొంతమంది గృహిణులు బీరకాయలు కూరకు కోయునపుడు పైనయున్న చెక్కు తీసి పారవేయుదురు. దానిని పారవేయకుండా పచ్చడి చేసుకొనవచ్చును. 4 బీరకాయలచెక్కు అయిన $\frac{1}{4}$ వీశె పచ్చిమిరపకాయలు కాని, పండ్లుకాని, 4 తులములు ఎండుకొబ్బెరగాని, పచ్చికొబ్బెరగాని, $\frac{1}{2}$ తులం ధనియాలు $\frac{1}{4}$ తులం జీలకర్ర, కొద్దిగా కరివేపాకువేసి బాణలిలో ఐదారుస్పూన్లు నూనెవేసి దోరగా వేగనిచ్చి దించవచ్చును. మధ్యసైజు వెలగకాయంత చింతపండు కడిగి ఒకపాత్రలో వేసి నానబెట్టవలెను. వేయించిబెట్టుకొన్న బీరకాయ చెక్కును రోటిలోవేసి దంచవలెను. సగముమెదిగిన తర్వాత చింతపండు, తగినంత వుప్పువేసి మెత్తగా దంచి వుప్పుసమముగా చూచి తోడవలెను. ఇది అప్పటికప్పుడు చాలరుచిగా యుండును. $1\frac{1}{2}$ రోజుకు ఎక్కువ వాడరాదు.

మిస్. కే. పద్మ

## బీరకాయదోసెలు

పావుశేరు పెసరపప్పు, 1 పావుశేరుబియ్యం, నాలుగు గంటలముందు నీళ్ళలో నాననీయవలెను. తరువాత ఒక $\frac{1}{2}$ వీశె బీరకాయలు పైచెక్కుతీసి చిన్న చిన్న ముక్కలుగా తరిగి యుంచుకొనవలెను. నానిన పప్పు, బియ్యము, బీరకాయముక్కలు, తగినన్ని పచ్చిమిరపకాయలు, ఉప్పు, కొద్దిగా అల్లము ఇవియన్నియు చేర్చి మెత్తగా రుబ్బవలెను. రుబ్బిన తరువాత కొద్దిగా జీలకర్ర కలిపి పెనముమీద నూనెతోగాని నేతితోగాని దోసెలుపోసిన చాలాబాగుండును. వేడిమీద తినిన చాలారుచిగా నుండును. ఇష్టమున్నవారు నీరుల్లిపాయ చిన్న చిన్న ముక్కలుగా తరిగివేసికొన వచ్చును. ఇవి ఫలహారముల కుపయోగించవచ్చును.

కస్తూరి కృష్ణకుమారి

## మోపూరు పెరుగు

ఈపెరుగునే యెర్రబాణి కూడా ఈప్రాంతములలో అందురు. నెల్లూరిజిల్లా, కోవూరుతాలూకాలో మోపూరు అనే గ్రామముకలదు. పాడిపంటలకీ గ్రామము చాల ప్రసిద్ధి. ఈయూరికేరుతో ఇచట అనాదిగ ఒకవిధమగు పెరగును తయారు చేయుచున్నారు. నాలుగైదు రోజులవరకు తియ్యగనే యుండును. కొంచెము కూడ పులుపెక్కదు.

షుమారు 30 శేర్ల మంచిపాలను ఒక బాణలిలో పోసి, గుంటలో పిడకలు, పొట్టుశెగమీద కాగ బెట్టుదురు. అడుగున మాడకుండ అప్పుడప్పుడు కలియబెట్టుచుండవలెను. ఇట్లే ప్రొద్దుననుండి సాయంకాలము వరకు నిదానముగ కాగి, పోసిన పాలలో అరవవంతు మాత్రము మిగులు వరకు ఇనుకునట్లు కాచవలెను. చిక్కని మీగడ, ఎర్రగ ఇనికిన పాలు కలసియుండును. అంతట ఆపాలను చిన్నముంతలలో పోయుదురు. క్రమముగ చల్లారి అతిమధురముగ నుండును. దీనిలో చేమిరివేయరు. ఈపాలు అట్లే పెరుగుగ గడ్డకట్టుకొని చిక్కగా ఉండునేగాని గట్టిగా పెళ్లలుగా నుండదు. దీనిని ముక్కవగా కూడ భుజింపలేము. చాలరుచిగా నుండును;

వంగోలు కనకవల్లి

# ముద్దుబిడ్డ

శ్రీమతి
నిమ్మస మనోరమాదేవి

బిత్తరిలేడిచూపులను పెత్తనముల్ సవరింపనెంచిబల్
ముత్తెపునత్తిమాటలను ముద్దులమూటలు గట్టునట్టిమా
పుత్తడిబొమ్మచిన్నినగు మోమునలోకము లెల్లగాంచిమా
చిత్తముహర్షవర్షముల తోనిగురెత్తెడు నెల్లవేళలన్

అర్థములేనిమాటలకు వ్యాఖ్యలుజెప్పగ సాహసించు మా
సార్థకప్రేమవాక్యముల సారముపిల్లలు లేనివారికిన్.
వ్యర్థమటంచుదోచి పరిహాసముసేయుదు రింతెగాని ధ
ర్మార్థసుకామ మోక్షములయందలి సారములిందుగానమే!

గజ్జెలు ఘల్లుఘల్లుమనగా నగుమోమున ముద్దుకృష్ణుడున్
బొజ్జనుముద్దులాడునెడ పూజ్యవినాయకు మెప్పుమేతలుఁ
లజ్జమొగంబుగాంచమిధిలాధిపుసూతి మనోహరత్వముఁ
కజ్జములాడుచోరణి కాంతునిశౌర్యము లొప్పుపాపలో.

# ప్రేమ

శ్రీ వావిలికొలను వెంకటరమణరావు

జగము ప్రేమమయము - బ్రహ్మమయముకూడాను. కాన బ్రహ్మము ప్రేమమయ స్వరూపము. ప్రపంచములోని జీవకోటి పరస్పర ప్రేమామృతమువలనే పోషింపబడుచున్నది. తల్లిదండ్రులకు తమ బిడ్డలయందుండు ప్రేమ, మిత్రుల అన్యోన్యానురాగము, భార్యాభర్తల ప్రేమ, మృగములయందు మనము చూపు కారుణ్యము, ఇవి అన్నియు ఒకే విధమైన ప్రేమయా? లేక ఏమైన భేదమున్నదా? వీటి నన్నింటిలో ప్రేమభావమున్నది. కాని ప్రేమ భావముయొక్క దృష్టి వేఱు.

శ్రీకృష్ణుడు గోపికాలోలుడనియు, అనేక గోపికలను ప్రేమించి, రమించినాడనియు గాథలున్నవి. మఱియు దీనికి అనుగుణముగ వేనవేలు గోపికా గీతములు వాడుకలోనున్నవి. స్థూలముగ పరిశీలించిన శ్రీకృష్ణుడు ఒక వ్యభిచారియని తేలుచున్నది. ఈ అభిప్రాయము సరిగాదని మా తీర్మానము. గోపికలందు శ్రీకృష్ణుడు జూపిన ప్రేమ కామజనితమైనదికాదు. గీతాకారకుడైన శ్రీకృష్ణభగవానుడు యిట్టి జారత్వమునకు పాలగునా? భగవద్గీతలలోని నీతి, ధర్మము, సత్యము, న్యాయములకు అయ్యది బద్ధవిరోధముగదా? శ్రీకృష్ణుడు పరమ యోగీశ్వరుడు. అట్టివానికి వ్యభిచారము నాపాదించుట కేవలము మన మూఢత్వమును సూచించుచున్నది. దీనిని లోతుగ పరిశీలించిన శ్రీకృష్ణుని ప్రేమ నిర్మలమైన మహానురాగ భావముకాని వేఱు కాదని గోచరించును. యోగతత్వములో మిక్కిలి విశిష్టమైన దృష్టిభావములను తెల్పుచున్నది. కృష్ణప్రేమ - బ్రహ్మము ప్రేమమయ స్వరూపుడు. సర్వాంతర్యామి. కాన జీవకోటియందెల్ల నాతత్వము వ్యాపించియున్నది.

ప్రేమ గొప్ప శక్తి పూరితమైనది. పెక్కు ఘన కార్యముల సాధనము. నిర్మలమైన ప్రేమ ఇహపరములందు ఒకే స్వభావముకలది. ద్వేషము, అసూయ, క్రౌర్యము వీటిని జయించు శక్తిగలది.

కోఱిక (desire) ఒక కొఱతను సూచించుచున్నది. సౌందర్యమును మోహించు ప్రేమ సౌందర్యమైన వస్తువుకాదు. అది సౌందర్య వికార భావము. అది ప్రేమ భావమునకు ముఖ్యముకాదు. ప్రేమ ఒక సౌందర్యభావమే - మహాతత్త్వవేత్త అయిన సాక్రటీసు (Socrates) యిట్లు వ్రాసియున్నాడు. ప్రేమ సౌందర్యమునందు ఏమి కోఱును? సౌందర్యముయొక్క స్వాధీనము (Possession) దానికి చాలును. అయితే ప్రేమానుబంధమనునది ఒకటి యున్నది. అట్టి ప్రేమ సౌందర్యమును ఒక విషయాభిలాషతో చూచును. ఇది జీవకోటిలో సాధారణముగ దృశ్యమగు ప్రేమయొక్క కామోద్రేక భావము. మానవుడుకూడ సౌందర్య సమత్వమునకే సృష్టికి పూనును. ఈ ప్రయత్నము మానవుడుకోఱు శాశ్వత్వమునకు ప్రథమ సంభావన. పశ్వులలోకూడ జీవితమును పొడుగించుటకే, వాటి అన్యోన్యానురాగ చేష్టలవలన ఇట్లు ఊహించతగియున్నది. అది క్షరతత్వ వస్తువులలో పరంపరగా పరిణమించును. ఇది శాశ్వత్వముయొక్క ఛాయ. మఱియు ప్రేమను ప్రఖ్యాతికి అన్వయించవచ్చును. అపుడు అయ్యది శాశ్వత్వముయొక్క ప్రకాశమైన ప్రతిమ యనవచ్చును. ఖ్యాతికోఱిన యాత్మ బిడ్డలం పుట్టించక ఘనకార్యములజేయదొడంగును. క్రమముగ సౌందర్య రూపములు, అభ్యాసములు, తలంపులుకలిగి సౌందర్యాతీత (absolute beauty) భావమును మానవుడు పొందవలయును. అట్టి సౌందర్యమునందు మనస్సులయమైన సత్యమును (reality) స్థాపించుటగాక మానవుడు దైవమిత్రత్వమునకు పాత్రుడగును. మఱియు నాతడు శాశ్వత్వమునకర్హుడై చిరంజీవియగును.

దైవాన్వేషణము మానవుని ఆఖరు చింతయై ఉన్నది. దైవము, గుళ్లలోను, ప్రతిమలలోను, కన్పించడు - ప్రేమసాధనవలన కనుగొననగును. ఇట్టి అతీతమైన ప్రేమను శ్రీకృష్ణుడు గోపికలందు చూపెను. అయ్యది కామోద్రేకమైన ప్రేమకాదు.

ఈ తత్వమును వెల్లడిచేయు శ్లోకమును ఈ క్రింద వ్రాయుచున్నాను.

"అంగనామంగనా మంతరే మాధవం
మాధవం మాధవం చాంతరే చాంగనా
ఇత్థమాకల్పితే మండలే మధ్యగో
సంజగౌ వేణునా దేవకీ నందనః"

శ్రీ కృష్ణభగవానుడే సర్వ వ్యక్తులయందున్నాడు. కృష్ణతత్వము ప్రతి పురుషునియందున్నదనియు, ప్రతి స్త్రీకి తన భర్తయందు కృష్ణతత్వమే యున్నదనియు తెలుపుటకు ఈ క్రీడను కావించెను గాని వేఱు కాదు.

సృష్టి ప్రకృతి పురుషజనితము. అందు భేదములు ప్రకృతి భిన్నరూపములవలన కలుగుచున్నవి. సృష్టియందు యీ రహస్యమును తెలుసుకొనిన మానవులు ఎంత అదృష్టవంతులు! మానవులను విభజించు భేదములు నశించును. అన్యోన్య మైత్రి అనురాగము కలుగును. కామ, క్రోధములు నశించును. ప్రతి వస్తువునందును ఏకత్వభావమునే గణించుటవలన ప్రేమానురాగము కలుగును. ఈర్ష్య వికలత్వములుండవు. ఏకతత్వమువలన ఐక్యభావము, మిత్రత్వము, సౌజన్యము మొదలగు భావములు పెంపొంది మానవకోటికి బ్రహ్మానందమును కలిగించును.

'ప్రియ' మనగా ఇంద్రియములకు సుఖమనితోచు ఐహిక ప్రీతికూడాను. 'శ్రేయము' ఆత్మయొక్క నిజకల్యాణము. 'ప్రేయము' (ప్రియము) బాహ్యేంద్రియ సుఖము. శ్రేయము ఆత్మయొక్క నిత్య కల్యాణము. ప్రేయము అనిత్యము. శ్రేయము నిత్యము - మానవుడు బుద్ధిపూర్వకముగ నెన్నడును అనిత్యమైన దానిని కాంక్షించడు - ఆత్మకల్యాణమునే కోరును. ఆత్మయొక్క నిజతత్వమునే దృష్టియందుంచును. జీవసృష్టిలో సంతతి నుత్పాదించుట, సంరక్షించుట ముఖ్య ప్రవర్తనగనున్నది. సృష్టిలో నైతము సృష్టిపరిణామములో వృద్ధియగు తరుణమున స్త్రీ పురుష ద్వంద్వస్వభావమైన యొకక్రిమి నశించి రెండు క్రిములుగ విభజనయై స్త్రీ, పురుష రూపములను పొందుచున్నది. ఇట్లు స్వార్థత్యాగము చేయుటలో ఆనందము కలుగుచున్నది. ఇది అతిసూక్ష్మమైన సృష్టి నైసర్గిక స్వభావ రహస్యము. ఇంద్రియ గమ్యమగు బాహ్యసుఖమునకంటె, బుద్ధిగమ్యమగు ఆధ్యాత్మిక సుఖమునకు యోగ్యత అధికమని నిరూపించవలసి యున్నది.

---

# ఆడజన్మ

వెంకటరత్నం అంటే శివకోవెల్లో పురాణం చెప్పుకునే వెంకమ్మగారు. మావూళ్ళో ఆవిడ పేరు తెలియని వాళ్ళు లేనేలేరు అంటే నమ్మండి. భర్త వున్నప్పటికీ లేదని భావించుకునే మహా పతివ్రత. కాషాయిగుడ్డలంటే ఆమెకు మహాప్రీతి. అందుచేత యెప్పుడూ కాషాయి బట్టలే కట్టుకునేది. కాషాయి బట్టకట్టుకొని, చేతితో భాగవతం పట్టుకొని రోడ్డుమీద నడుస్తూంటే చూడ్డానికి ఎంతో ముచ్చటగా నుండేది. అయినా ముసలిదా, ముక్కాదా నలభైయోపడి. యౌవనపటుత్వానికి అందచందాలకి యేమీలోటులేదు. సన్యాసం అంటే పుచ్చుకుంది గాని మనిషిమాత్రం యేమీ చిక్కిపోలేదు. చూడ్డానికి మాత్రం బాగా బలసిన గాను గెద్దలాగ వుండేది. నలుగురమ్మలక్కలు అంటూవుండేవారు కూడా. అదేమిటమ్మా! మొగుడు వున్నదానివికదా చక్కగా రంగుబట్టలు కట్టుకోక కాషాయి గుడ్డలు కట్టుకుంటావేమిటని. కాని ఆవిడ మాత్రం పట్టించుకునేదికాదు. ఆ! మొగుడు మొద్దులూను. చిన్నప్పుడన్ని ఆముచ్చట్లు తీరిపోయినాయి. యింకా యిప్పుడుకూడా యేమిటి. యిప్పుడొచ్చాయి, ఈవాయిలు చీరెలు, జెనేరకు చీరెలు. సిల్కు గుడ్డలును. ఆకాలంలో త్రేతాయుగంలోను, ద్వాపరయుగంలోను వాళ్ళంతా యేరంగు చీరలు కట్టుకున్నారు. యింతకి నేను ముక్తికోసం పాటు పడుతూ వున్నదాన్ని; నాకెందుకవన్నీను అనేసి వూరుకునేది.

ఒకనాడు నేను నాసన్నిహిత మిత్రుడు ప్రకాశరావు కలిసి కోవిల్లోనికని వెళ్ళేము. మావాడికి ఆవిడిని చూడగానే యేవో చిలిపిచేష్టలు చెయ్యాలని బుద్ధిపుట్టింది. అయితే యేం చేసినప్పటికి చెప్పుచ్చుకొని కొడుతుందని తెలుసు. అయినప్పటికి వుండబట్టక నాతోమాత్రం యిలా అన్నాడు. "ఓరే! రావు! చూచేవుట్రా యీ ఆడవాళ్ళ పొగరు. వీళ్ళంతా చదువులు చదివి వుద్యోగాలు చేస్తూ వూళ్ళమీద తిరుగుతూ వుండటం వల్ల మగవాళ్ళకి గిరాకీ తగ్గిపోతూంది. నాన్‌సెన్సు, ఆడవాళ్ళు వుద్యోగాలు చేయకూడదు" అన్నాడు. ఆమాటలకి ఆమెకు కోపం వచ్చిందికాబోలు చర్రునలేచి ఒక్కసారి కళ్ళద్దాలు పైకెత్తి చూస్తూ ఒరే ప్రకాశం నువ్వేనుట్రా అలాగ వాగుతున్నావు. ఆడదాని సంగతి యింకా నీకు తెలియదు. కుర్రకుంకవి. యిలా కూర్చో చెప్తాను. అని ఆమె వేదాంతం అంతా చెప్పడం మొదలు పెట్టింది.

"జగత్సర్వం స్త్రీమయం. స్త్రీలేనిదే యీప్రపంచమేలేదు. యీప్రపంచాన్ని అంతా సృష్టించిందే స్త్రీ. ఓంకార పరబ్రహ్మ శక్తి స్వరూపమే స్త్రీ. ప్రపంచమంతా స్త్రీని ఆరాధిస్తూవుంటే నువ్వామెను దూషిస్తున్నావా! యింతెందుకు ప్రకాశ్ ఒక్కవిషయం ఆలోచించుకో. నువ్వెందులోంచి పుట్టేవో తెలుసా? నిన్ను సృష్టించినవారెవరో తెలుసుకున్నావా? ఆడది నీప్రక్కన లేకపోతే నీమగజన్మ యెందుకు - కాల్చనా? నువ్వు ఉదయాన్నే బడిలోనికి వెళ్ళి ప్రార్థనలు చేస్తావు యెవరిగురించి? ఓభారతమాత అంటావు; ఆభారతమాత యెవరు? "సరస్వతీ నమస్తుభ్యం, వరదే కామరూపిణీ" అని పద్యం చదవందే పుస్తకం చేతబట్టవు కదా? ఆసరస్వతి యేశక్తిస్వరూపము? స్త్రీరూపము. ఈప్రపంచకము అంతా ఆశక్తిస్వరూపము మీదనే ఆధారపడివుంది. అందుకనే దసరాల్లో శక్తినిగురించి పూజలు చేస్తారు. అటువంటి శక్తిస్వరూపమయిన స్త్రీని గురించి పూర్తిగా తెలుసుకోకుండా విమర్శించటం, అవమానించటం యీమగపురుగులకో అలవాటయిపోయింది. యే పురాణాల్లో చూచినా, యే వేదాల్లో చూచినా, యే లోకంలో చూచినా ఆడదాందే అగ్రతాంబూలం అంటే నమ్ము. నేటి ప్రపంచములో కూడా రష్యా, అమెరికా, ఇంగ్లాండు దేశముల్లో చూస్తే ఆడదానికే యెక్కువ ప్రాముఖ్యత యిస్తున్నారు. యీనాడు మన దేశములో మగవాళ్ళు మదంబలసి మైమరచి, ఆడదాని ఔన్నత్యాన్ని చూచి సహించలేక, ఆడది వీధిగుమ్మం దాటితే అవమానకరమని మెడకి తాళిగట్టి యింట్లో కూర్చుండబెట్టేరు. యిటువంటి మగవారి చేష్టలు యికమీద సహించకూడదు. ఇంక యింటికిపో ప్రకాశ్,

చాలా పొద్దు పోయింది. ఇకనైన బుద్ధి తెచ్చుకొని ఆడజన్మ గురించి బాగా ఆలోచించుకో” అని ఆమె అంటూవుంటే ఇంత అల్లరి శుంఠకాయ అయిన ప్రకాశు చిక్కి అయిపోయి శుక్కి అయిపోయేడు. దేవుడికి దండం పెట్టుకొని యిద్దరం కలసి చల్లగా యింటికి జారేం.

ఆరాత్రి ప్రకాశం మాయింటికి వచ్చి, ఒరే రావు! చూచావురా! దీని పొగరు. దేవుడిమీద లేని భక్తి వుంగ్రాళ్ళమీద అన్నట్టు, ప్రత్యక్ష దైవమైన భర్తమీదలేని ప్రేమ యీస్వాముల వార్లమీద, గుళ్ళో దేవుళ్ళ మీదనా. పాపం! ఆభర్త పెళ్ళాం చేతులో కీలుబొమ్మలాగ తిరుగుతున్నాడు. యింట్లో పక్కలు వెయ్యటం, పిల్లల బట్టలు వుతకడం అంతా అతనేకదా! ఆఖరికి విధిలేక రాత్రిళ్ళు పెళ్ళాం కాళ్ళుకూడా పిసుకుతున్నాడట. పాపం అమాయకపు బ్రాహ్మనుడు, యేం చేస్తాడు! కట్టుకున్న పెళ్ళాన్ని కాళ్ళ తన్నగలడా, కాదని మరొక చోటుకి పోగలడా. యిన్ని పనులు చేసినప్పటికి వేళకి సరిగా ముద్దలేక పోతూందాయె. 'చేసుకున్న మొగుడా అనుభవించురా' అని యిదంతా అతని కర్మకాకపోతే యింకేమిటి. అతనికర్మకి యెవరు భాధ్యులు? భాధ్యతగల పెళ్ళామే దూరం చేస్తూంటే పైవాళ్ళకేం కావాలి. వుదయాన్నేలేచి వూరుమీదికి పోతేనేగాని యిట్లో జరగదాయె. ప్రొద్దున్నే ఆరు గంటలు కొట్టేసరికల్లా వూరుమీదికివ్యాపకానికిపోయి మధ్యాహ్నం యేపన్నెండు గంటలకో యింటికి తిరిగి వచ్చే మగవాడిమీద విరుచుకు పడే ఆడదాన్ని చూచి యేమగవాడు సహించగలడు? నిత్యమూ యీబాధలు పడలేక ఒకనాడు అనేసేడటకూడా. ప్రాణం విసిగిందిమరి, యెంతకని సహించి వూరుకుంటాడు? మొగుడయి వున్నప్పుడు ఒకనాడైనా మొర మొరలాడ్డామరి. “ఒసే వెంకమ్మ ఇదిగో నువ్వు రోజూ కోవెల్లోకి వెళ్ళి వుదయం పన్నెండు గంటలకి, సాయంత్రం ఎనిమిదిగంటలకి యింటికి వస్తూవుంటే నాగతేం కాను. నేను ఆఫీసుకు వెళ్ళడం యెట్లా, నీకుతిండి బెట్టేవారెవరు? డబ్బు తెచ్చే వారెవరు? ఆస్వాములవార్లు యేమన్నా నిన్నుపోషిస్తున్నారా? యెందుకు నీకాస్వామీజీ మీద అంత భక్తి. ఆసన్యాసి ముండాకొడుకుల వెనుక తిరిగితే నీకేమి వస్తుంది? యింటికొచ్చిన మొగుడికి వుడికిందో వుడకందో యింతముద్ద పడవేయకపోతే ఆముండాకొడుకు యెలా చస్తాడనుకున్నావు?” అని యేదో కొంచెం కోపంగా అనేసేటికల్లా ఆమహా యిల్లాలు తోక్కతొక్కిన పాములాగ చుర్రున లేచిపోయింది మొగుడిమీదికి. ఆ! యేమిటంటున్నారు, నన్ను యెన్ని మాటలేనా అనండికాని, నాస్వామిజీని మాత్రం యేమనకండి. అతను మహాయోగి, గొప్ప త్యాగి. నిత్యము అతని పాదాలకి పూజచేస్తే మనం చేసిన పాపాలు పోతాయి. యింతకీ వయస్సులో వున్నప్పుడు మొగుడూ పెళ్ళాల వరసగాని, నలభైయాభై యేళ్ళువచ్చిం తరువాత యింకా యేమిటి? యివ్వాళ దగ్గరనుంచి మీరు నావూసు యెత్తవద్దు. మీరెవరో నేనెవరో. యివ్వాళదగ్గరనుంచి మీరు నాజోలికి రావద్దు. జాగ్రత్త అని ఖచ్చితంగా చెప్పేసింది. ఆగయ్యాళి అలా మాట్లాడుతూవుంటే యింకేమి చేయగలడు, చేసుకున్న కర్మంరా శంభులింగం అనుకొని నోరుమూసుకొని వూరుకున్నాడు.

ఇలా మాప్రకాశం చెప్తూ వుంటే కోవెల్లో పురాణాలు చెప్పుకునే వెంకమ్మగారు యింత వేదాంతురాలా అనిపించింది. అయితే వాళ్ళయింటి భోగట్టాలన్నీ మావాడికి ఎలాగ తెలిసేయా అని నేను అడక్కపోలేదు. మా మిత్రుడు కూడా వాళ్ళ యింట్లోనే బస చేస్తున్నాడుట. వాళ్ళయింట్లో యేగల్లంతు జరిగినా మావాడు పొంచుండి వింటూవుంటాడు. అయితే నేను సన్నిహిత మిత్రుడిని అవటంవల్ల అవన్నీ నాకు మోసుకొనివచ్చి చెప్తూవుంటాడు. ఇంతే జరిగిన విషయం.

ఎన్. కామేశ్వరరావు

ఆధునికమైన వారు. వారి మనస్సులు సామాన్యమైనవి కావు. సంయమనము, శిక్షణ, అభ్యాసాదులవల్ల వారి మనస్సులు బహునిశితమైనవి. అట్టిమనస్సులతో వారు అన్ని అంతరములుగల విశేషములను కని పెట్టి భౌతికస్థితికి మూలకారణాలను తెలియ జేస్తున్నారు. ఆవిషయాలను అర్థం చేసు కొన్న నవీన ద్రష్టలు, ఆమహాఋషుల దివ్యశక్తులను వేనోళ్ల ప్రకటిస్తూ 'ఉపనిష త్తుల కాలము ననుసరించండి.' అని ప్రచారం చేస్తున్నారు. దీనినిబట్టి నేటికిని మనలో వున్న కొన్ని ఆచారాలఘనతను గ్రహించండి! వాటిని అనుసరించడంవల్ల మనకు కలిగే ప్రయోజనాన్ని గుర్తించండి.

ఉత్తరదిశగా తలపెట్టుకొని పండుకో రాదు అని ఎందుకన్నారో ఇక్కడ తెలుసు కొందాము. ఆలాగు పండుకొంటే ప్రాణ శక్తి మన హృదయాలలోకి, శరీరాలలోకి ప్రవహించదు. మనం మేలుకొన్నప్పుడు ప్రాణశక్తి మన మెదడు, ఆలోచనవల్ల ఖర్చు యిపోతూంది. నిద్రపోతూండగా మెదడు, ఇంద్రియాలు పనిచెయ్యవు కాబట్టి ప్రాణశక్తి మిగత శరీరానికి ప్రవహించడానికి వీలవుతూంది, అటువంటి సందర్భంలో తల ఉత్తరం వైపు కనుక పెట్టుకొని పండు కొంటే, భూమియొక్క అయస్కాంతా కర్షణం ఉత్తరం వైపుకు ప్రవహిస్తూ, ప్రాణ శక్తిని ఉత్తరం వైపుకి లాగివేస్తూంటుంది. శరీరంలోని దిగువ భాగానికి ప్రవహించ వలసిన ప్రాణశక్తి ఉత్తరం వైపుకి లాగి వేయ బడుతూ ద్వంద్వయుద్ధం చేస్తూ వ్యయమై పోతూంది. తల ఇతర దిశలలో పెట్టుకొని పండుకొంటే ఈబాధ ఉండదు. తూర్పున తలపెట్టుకొని నిద్రపోడం శ్రేష్ఠం.

టి. కా.

---

ఒక తెలివైనభార్య తన భర్తతో "ఏమండీ! నాకు యిరవైరూపాయలు బదులిచ్చి అందులో పది రూపాయలు మాత్రం నాకిప్పు డివ్వండి. అప్పుడు మీరు నాకు 10 రూపాయలు బాకీ తేల్తారు; నేను మీకు 10 రూపాయలు బాకీ తేల్తాను. అందువలన మన యిద్దరికి పేచీలు ఏమియుండవు" అన్నది.

♦ ♦ ♦

ఒక పండిత పుత్రుడు మరొకడితో "కాళిదాసు రచించిన 'శాకుంతలం' మనోహరమైన నాటకం సుమా" అన్నాడు.

"నిజంగానే" అన్నాడు మరొకడు.

"నీవు చదివావా ఎప్పుడైనా"

"లేదు. నీవు చదివావా"

"లేదు"



# స్నేహమూర్తి



శ్రీ యస్. రాజేశ్వరీరాణి

రామయ్యగారు వకీలుయైననూ బహుచాంధసులు. వారి ఏకైక కుమార్తె కమలాంబను బాల్య వివాహమునకు గురిచేసి అచిర కాలములోనే కమలాంబ సుఖములన్నియు నీటగలిపిరి.

కమలాంబ కిప్పుడు పద్దెనిమిది సం|| ములు వచ్చెను. ఆమె నలుపయినను ఆమె ముఖము సుందరముగ నుండును. ఆమె పెద్ద కళ్లలో భవిష్యత్తు దాగుకొని యుండెనా అని మనశ్శాస్త్ర ధురీణులకు తప్పక తోచును ఆమెను చూస్తే. ఆమె అంగములన్నియు యవ్వనము వచ్చుటచేత పరిపూర్ణత్వము నొందెను. మోకాలిదాటిపడు కేశముల ముడుచుకొని తెల్లటి యుతికిన గుడ్డలదాల్చి ఆమె ప్రతిరోజూ కోవెల కేగుతరి అచ్చటి పెద్దవారు "అయ్యో పాపం" మనుకొందురు. ఆమె నిదానము, పనులందు ఉత్సాహము చూచి "ఈమె పునిస్త్రీ అయి వుంటే మగనిని అన్నివిధముల తప్పక సుఖపెట్టి యుండునని" ఇరుగు పొరుగు అమ్మలక్కలు అనుకొనుచుందురు. ఏడు సం|| ములకే విధవయిన కమలాంబను తిరిగి పెండ్లి చేయవచ్చునని పెద్దలు వకీలుగారితో వాదించినా ఆయన చాంధత్వముచేత ఒప్పుకోలేదు.

కమలాంబ తోటిపిల్లలు అత్తగారిండ్లకు పోవడము, భర్తలతో సినీమాలకు, దేవళములకు రావడం చూచి నిట్టూర్చుకొంది. "భగవంతుడా! నేను ఏపాపము చేసితిన"ని అల్లలాడింది. పన్నెండవ ఏటనే ఆవూరి పూర్తిచదువు ఎనిమిది క్లాసులు చదువుకొన్న కమలాంబకు స్నేహితురాళ్ళు వున్నారు. వారు అత్తగారిండ్లకు వెళ్ళుచున్నాము అని వ్రాసిన జాబులు చదివి లోలోపల దుఃఖించుకొంది.

తనభర్త ఎవరో తానెరుగదు. తెలియని కాలమున పెండ్లి జరిగినది. జరిగిన ఏడాదికే గతించె వరుడు. "అప్పటికి తాను అమాయికంగా బట్టలువిడిచి తిరుగుతున్న బాల" ఇలా ఆలోచించుకొంటూ విచారంతో గడిపేది కమలాంబ.

దేవుడు ఆమె మొరల ఆలకించాడా అన్నట్లు కమలాంబ స్నేహితురాలు పరమేశ్వరి అను ఆమె ఆనాడు వచ్చింది కమలాంబను చూడను. పరమేశ్వరి ఇప్పుడు ముగ్గురు బిడ్డలతల్లి. ఆమె కమలాంబకన్నా మూడేళ్లు పెద్ద. ఇంచుమించు కమలాంబ పెండ్లితోనే ఈయమ పెండ్లి అయింది. పరమ భాగ్యవతి. ఆమె భర్త ఇప్పుడు ఉన్నత ఉద్యోగి. రామయ్యగారితో కమలాంబ పెండ్లి విషయంగా వాదించిన వారిలో మొదటి నంబరు.

చిన్ననాటి స్నేహితులు తీరిగ్గా దేవళానికొచ్చి కూచున్నారు. పరమ క్షేమాలన్నీ అడిగి "ఇప్పుడేమంటున్నారు నాన్నగారు" అని అడిగింది. కమలాంబ సిగ్గుపడ్డది. ఆవిషయం మార్చి "అక్కా! ఒక్క బిడ్డనయినా తీసుకొని రాలేదేం" అని అడిగింది. పరమనవ్వి "పెళ్ళికి చూస్తావులే కమలా! చూడు. నేనొకవరుణ్ణి చూసాను. ఈసారి మీ నాన్నగార్ని ఎలాగైనా ఒప్పిస్తాను. పిల్లవాడు బి. ఎ. ప్యాసయ్యాడు. ఏదోకంపెనీలో వున్నాడు. నేను నిజం అంతా చెప్పివేసాను. అతనిపేరు రామకృష్ణ. ఒప్పుకొన్నాడు. ఇంచు మించు రెండు రోజులలో రాగలడిక్కడికి" అని చెప్పివేసింది. కమలాంబ మనసు సంతోషపడ్డా తండ్రి ఏమంటాడో అని భయపడ్డది.

అనుకొన్నట్లుగానే రామకృష్ణ మూడోరోజు దిగపడ్డాడు. రామం ఎఱ్ఱగా, పొడుగ్గా, తగినలావుగా బాగున్నాడు. ముందు ముందు గొప్ప ఉద్యోగి కాగల గొప్పలక్షణాలు రామం నుదురు చూపుతోంది.

# రిపబ్లిక్ ఇండియాలోని, స్త్రీల బాధ్యతలు

శ్రీమతి పరణం సత్యవతీదేవి బి. ఏ.



రిపబ్లిక్ ఇండియా భావిభాగ్యోదయానికి పురుషుడెంతవరకు బాధ్యుడో, అంతకన్నమించిన బాధ్యురాలుస్త్రీ. ఇండియా స్వాతంత్ర్య సముపార్జనకై అచంచల దీక్షతో, నిశ్చలదేశభక్తితో పోరాటము సల్పిన, అరుణ, సరోజిని మున్నగుమహానీయురాండ్రు స్త్రీసమాజములకు మకుటాయమానములు. ఇండియా సర్వస్వతంత్ర సంపాదనానంతరము, తనప్రజా ప్రభుత్వములో ఒకవిజయలక్ష్మిని అమెరికారాయబారిగా, ఒకరాజకుమారిని ఆరోగ్యమంత్రిణిగా, ఒకసరోజినిని రాజధాని గవర్నరుగాచేసి స్త్రీసమాజానికి అశేషగౌరవ ప్రపత్తులను కల్గించింది. వంటగది నాల్గు గోడలమధ్యనే తనప్రపంచమన్న విషయము స్త్రీలు మరచిపోయి, పురుషులతోబాటు చేయిచేయికలిపి, దేశసౌభాగ్యానికి, దేశకళ్యాణానికి పాటుపడవలసిన అగత్యము తమకున్నదన్న విషయము స్త్రీలు గ్రహించాలి.

స్త్రీజనాభ్యుదయానికై రిపబ్లిక్ రాజ్యాంగము స్త్రీలకుకొన్ని నూతనహక్కులను ప్రసాదించింది. సాంఘిక, రాజ్యాంగపరిపాలనాధికారములో, మత, వర్ణ, వర్గ, స్త్రీ పురుషుడు అనుబేధములేకుండ ప్రతివ్యక్తికి సమానత్వమిప్పించింది. ఆస్తిపాస్తుల విషయములో స్త్రీకికూడ, పురుషునితోబాటు ఆస్తినిప్పించేహక్కును ఇచ్చింది. బహుభార్యాత్వాన్ని నిషేధించి, శాంతమైన గృహజీవనమున కవకాశమిప్పించింది. కొన్ని రాజధానుల పరిపాలనలో ప్రముఖోద్యోగాలు నిర్వహిస్తున్నారు స్త్రీలు. సామాన్య స్త్రీలు టైపిస్టులు, టెలిఫోన్ ఆపరేటర్లు, స్టెనోగ్రాఫర్లుగాను, వివిధరంగాలలో పనిచేస్తున్నారు. సినిమాపరిశ్రమలో ఎక్కువమంది స్త్రీలు పనిచేస్తూ, కొద్దిమందిమాత్రమే మిక్కిలి ధనార్జనగావిస్తున్నారు. కాని, అమెరికా, ఇంగ్లండు, రష్యా, నార్వే, డెన్మార్కు, హాలెండు, స్విట్జరులెండు, జర్మనీదేశములలోని స్త్రీలు చాలకాలంక్రితమే పురుషులతోపాటు సమానహక్కు, ప్రతిపత్తి సంపాదించగల్గారు. ఈదేశాలలోని స్త్రీలు పురోభివృద్ధిచెందినట్లు మన ఇండియాలోని స్త్రీలు పురోభివృద్ధి చెందటం లేదనటంలో అతిశయోక్తి లేదేమో! ముఖ్యంగా అమెరికా ఇంగ్లండ్, రష్యాదేశాలస్త్రీలు చాలవరకు ముందడుగు వేశారు. 1918 సంవత్సరంలోనే ఇంగ్లండ్ దేశంలోని స్త్రీలు, ఓటింగ్ హక్కును, 1919 లో ఇరువదియొకటి వయస్సుకే పార్లమెంటుఎన్నికకు నిలబడగల అర్హత సంపాదించగల్గారు. సాండ్ హర్ట్సు సతి 1809 వ సంవత్సరంలో 'లండన్ కౌన్సిలర్'గా ఎన్నుకోబడినది. ఎడిన్ బర్గు యూనివర్సిటీలో

1867 సంవత్సరానికి పూర్వం స్త్రీలకు విద్యాబోధన ఉండేదికాదుగాని, తదుపరి కొద్దికాలానికే స్త్రీలకుగూడ విద్యాబోధన ఏర్పాట్లుచేసారు. ఫ్రాన్సుదేశంలో 1903వ సంవత్సరంలోనే ఒకస్త్రీ బారిష్టరై పేరు ప్రఖ్యాతులు సంపాదించ గల్గింది. అందరికన్న, అమెరికా, బ్రిటన్ దేశంలోని స్త్రీలు, చాలవరకు విద్యావంతులు. ఉపాధ్యాయవృత్తిలో ఎక్కువ మంది స్త్రీలు ఆయాదేశాలలో పనిచేస్తున్నారు. కానిమనదేశంలో స్త్రీలకు చెప్పుకోదగ్గ ఉన్నతపాఠశాలలుగాని, కళాశాలలుగానిలేవు. స్త్రీలకు ప్రత్యేకయూనివర్శిటీ విశ్వకళా పరిషత్తు గూడలేదు. కొంతవరకు విద్యావంతురాండ్రై, పట్టభద్రులైన స్త్రీలుగూడ వివాహవంతులై కేవలం గృహకార్యాలలో మునిగిపోతున్నారుగాని, అనువైన ఉపాధ్యాయవృత్తిని స్వీకరించి, తమ సముపార్జితమైన విద్యను మరొకరికి బోధించి, విద్యావ్యాప్తికి కృషిచేయకపోవటం చాలశోచనీయమైన విషయమే! ఉపాధ్యాయులేగాదు; తగినంతగా నర్సులు, డాక్టర్లు, మంత్రసానులు (Midwives), రెడ్‌క్రాస్ పనివాండ్రు కొరతగా వున్నారు. మనదేశంలో కుటీర పరిశ్రమాభివృద్ధికి, శరణార్థుల సహాయానికి, ప్రయోజన విద్యావ్యాప్తికి, పల్లెటూళ్లలో ఆరోగ్య సూత్రాలబోధనకు, ఆహార పదార్థాలవిలువను బోధించుటకు, వంటచేసే విధానము, నర్సింగ్, కుటుంబ వ్యయముల జాబితాలను (accounts) తయారుచేయు పద్ధతి మున్నగు విషయాలను విపులముగా బోధనచేయుటకు విద్యావంతురాండ్రైన స్త్రీలు అత్యవసరం. ఇవేగాక, మనఆచారాలను, మతవిశిష్టతను, మనమతధర్మాలను బోధచేయగల స్త్రీలుకూడ అవసరమైయున్నారు. ఇవన్నియుగాక గృహకార్యాలనుగూడ చక్కబెట్టి; గృహలక్ష్మి అనే పేరు సార్థకంచేసుకొనే బాధ్యతగూడ స్త్రీలమీదనేవుంది. గురుతరమైన యిట్టిబాధ్యతలను స్త్రీలు చిఱునవ్వుతో నిర్వహించగలుగుటకు, సర్వశక్తి సంపన్నులు కావలసి ఉంది. ప్రస్తుతము మనలోరావలసిన గొప్పమార్పులలో అవశ్యమైనది - ఎవరి బాధ్యత వారు గుర్తెరింగి, వాటికి అనుగుణంగా వర్తించటమే. స్వాతంత్ర్య సముపార్జనకు ముందు స్త్రీలు ఎంతటిధీయుక్తి, సాహసంతో, ఉత్సాహపూరితులై పనిచేసారో, అంతకు రెట్టింపుగా తమప్రస్తుతపు బాధ్యతలను గుర్తెరింగి, తమకార్యక్రమాలను, విధులను నిపుణతతో నిర్వహించగల శక్తి సంపన్నులగుదురని ఆశించెదము.






మనము ప్రతిదినము భుజించే కూరగాయలు సయితము వైద్యోపయోగము కలవి. అందులో కొన్ని ఆరోగ్యమును సమకూర్చగలవి; మరికొన్ని అనారోగ్యమునకు కారణమయినవి. కాబట్టి వానిగుణగణాలు తెలిసికోవడంవలన ఆరోగ్యాన్ని కాపాడుకో వచ్చును; అనారోగ్యమునుండి విముక్తులము కావచ్చును.

కూరగాయలలో సొరకాయ ఒకటి, లేతసొరకాయ పై తోలుతీసివేసి ముక్కలుగా తరిగి కూరగా వండుతారు; పప్పులో వేసి వండుకుంటారు. ముక్కలు అధికంగా వేసి చింతపండు పులుసుకాని, టమాటో (రామములగకాయల) బద్దలు కలిపి పుద్దగా వండుకుంటారు. ఈవంటకాలన్నీ చాల రుచికరమైనవి.

సొరకాయతో హల్వాకూడ చేయుదురు.

సొరకాయలో తెలుపు, నలుపు రెండురకాలున్నవి. తెలుపుకాయలు తియ్యంగా రుచిగా నుండును. నల్లటికాయలు కొంచెము వగరుగా నుండును. తెల్లకాయలకంటే నల్లనివే మంచివి.

సొరకాయ గుణాలను పరికిస్తే శ్లేష్మము, వాతము, మలబద్ధము, గురుత్వము చేయు నట్టిదైనను వంటకాలలో చింతపండు పులుసు, ఆవాలు, జీలకర్ర, శొంఠి, ఉప్పువాడుదురు కాబట్టి పై చెడుగుణాలన్నీ తొలగిపోయి అది పైత్యము నణచి వీర్యవృద్ధి నిచ్చును. చలువ జేసి దాహము నణచును. మూత్రమును జారీచేయును. శీతపైత్యము నణచి రుచి పుట్టించును. ముఖ్యముగా మేహపైత్యవ్యాధులకు పథ్యమైనది.

సొర ఆకు విరోచనకారి. లేతసొర ఆకు మూత్రమును ధారాళముగా జారీచేయును. సొర ఆకు కషాయం, పాండువు, కామెర్లకు చక్కెరకలిపి యిచ్చినచో నయమగును.

తియ్యని సొరకాయ గుజ్జు దగ్గు నివారణచేయును. తలకు, అరికాళ్లకు యీగుజ్జును పట్టించినచో అరికాళ్లమంటలు, తలపోట్లు, కండ్లమంటలు తగ్గును. తలనొప్పితో బాధ పడువారు ఈగుజ్జును నొసటిపైవేసి కట్టుకొనినచో నొప్పితగ్గును.

చివుకుల లక్ష్మీకాంతమ్మ

—(o)—




'ప్రజాసేవ':-

శోభనాచలవారి చిత్రం. యీ నెలలో విడుదలకు సిద్ధముగానున్నది. ఇందులో లక్ష్మీరాజ్యం నటించింది. డైరెక్టరు ప్రభాకరరావు. పర్యవేక్షణ మీర్జాపురం జమీందారుగారు.

◆ ◆ ◆

దాసి:-

రాజ్యంపిక్చర్స్ వారిచిత్రం. మహోన్నతంగా తయారయి ఆంధ్రదేశంలో విజయయాత్ర సాగిస్తున్నది. తమిళ వర్షన్ కూడ త్వరలో విడుదల కాబోతున్నది.

◆ ◆ ◆

'పరదేసి :-

సుప్రసిద్ధనటీమణి అంజలీదేవి నిర్మాణం. ఇందులో అంజలీదేవి, నాగేశ్వరావు వసంత మొదలగువారు నటించారు. ఇదికూడ యీనెలాఖరుకే విడుదల కాబోతున్నది.

◆ ◆ ◆

నాచెల్లెలు

అశోకావారి చిత్రం. ఆందులో జి. వరలక్ష్మి, బలిజేపల్లి, అమరనాథ్ మొదలగువారు నటించారు. దర్శకుడు చిత్రపు నారాయణమూర్తిగారు.

◆ ◆ ◆

పుట్టిల్లు:-

ఈ చిత్రనిర్మాణం చివరిఘట్టంలోనున్నది. డాక్టర్ రాజరావుగారు 'పుట్టిల్లును' చక్కని చిత్రంగా తయారుచేయడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. ఇందులో నూతన తార జమున నటిస్తున్నది. అరవంలోకి డబ్ చెయ్యడానికి కూడ సన్నాహాలు పూర్తి యయినవి.

◆ ◆ ◆

చంద్రహారం:-

విజయా వారిచిత్రం. దర్శకుడు కామేశ్వరరావు; రామారావు, శ్రీరంజని, సావిత్రి మొదలగు వారు నటిస్తున్నారు.



ఆవిడ పండంటి సంసారం
ఎండిపోయింది!
'నాయిల్లు'లో రాజకుమారి

# కమ్మని కబురు



పుట్టిల్లు చూద్దామంటే, ప్రాణంలేచి వస్తుంది కదమ్మా! పుట్టిపెరిగినచోటు, ఆశలు, ఆశయాలు అంకురించినతోట, కన్నతల్లి కనకంపు కోట "పుట్టిల్లు".

ఒక్కసారి పుట్టింటికెళ్ళి చంటిపాపలైపోయి, స్వేచ్ఛగా, కడుపార కేరింతలుకొట్టి హాయిగా గడిపే చోటు "పుట్టిల్లు". ఆప్యాయత ఆదరణ అన్నీ అమరిన స్వర్గం "పుట్టిల్లు".

"పుట్టింటి" గౌరవం ఎలా నిలబెడతారోనని ప్రతి తల్లిదండ్రుల హృదయం, ప్రతి ఆడుబిడ్డమీద, ప్రాణాలెట్టుకు చూస్తూంటుంది కదమ్మా! పుట్టింటి గౌరవం ఎలా నిలబెట్టాలి!

సుశీల ఏమంటుందో చూద్దాం

స్త్రీ వంట ఇంటికై సృష్టింబడినదో
స్త్రీ విలాసమునకై చిత్రింపబడినదో,
స్త్రీ దాస్య వృత్తికై చేతనంబైనదో,
చెప్పవే మాయమ్మ చెప్పవే తల్లి!

అని తల్లిదండ్రుల హృదయాన్నీ ప్రతిధ్వనించేలా ప్రశ్నిస్తోంది.

తండ్రిచాటున, భర్తమాటున, కొడుకు పోషణలోనూ, జీవితం వెళ్ళబుచ్చే ప్రతి స్త్రీకి, యీ సుశీల ప్రశ్న మేలుకొలుపుకదమ్మా!

మొత్తం జనాభాలో సగంభాగమయిన స్త్రీలు, అట్టడుగునపడి మూల్గుతోంటే, భారతజాతి అభివృద్ధి ఎట్లా సాధ్యం? స్త్రీ కూడా సంఘంలో పురుషులతోపాటు, వృత్తి వుద్యోగాల్లోనూ, ప్రజల అవసరాలను వుత్పత్తి చేయుటలోనూ, సమాన బాధ్యతలు నిర్వర్తించుటకు ముందుకు రావాలి. అలానాడు గాని స్త్రీ యొక్క సహజ శక్తులు రాణించవు.

అయితే, ఆ అవకాశాలను పొందాలంటే ఏం చెయ్యాలి? సుశీల ఎన్ని అవస్థలు పాలైంది! అన్నిటిని ఓర్పుగా, ఎదిరించుతూ, స్త్రీ ఔన్నత్యాన్ని ఎలా చాటింది? "పుట్టింటి" గౌరవాన్ని, ప్రతిష్ఠను ఎలా నిలబెట్టింది? ఆ సుశీల నడుగుదాం.

ఆ సుశీల ప్రతివారు సినిమా థియేటర్లోనూ, మీ అందరికి త్వరలో కన్పించుతుంది. ఆమెనుచూచి ఆమె ఆదర్శాలు అనుసరిస్తారు కదూ!

"పుట్టిల్లు"



# ఉత్తమోత్తమగు చిత్రం 'దాసి'



రాజ్యం పిక్చరువారిది ప్రథమ ప్రయత్నమయినా 'దాసి' చిత్రాన్ని ఉత్తమమయునదిగా నిర్మించకలిగి నందులకు అభినందనీయులు.

'సంసారం' చిత్రనిర్మాతలలో నొకరైన శ్రీ సి. వి. రంగనాథదాస్ గారు తాముగడించిన అపారఅనుభవము 'దాసి' చిత్రమును సర్వాంగ సుందరంగా నిర్మించడానికి ఉపయోగించుకో కలిగారు.

కథ పొందిక, నడక సహజంగాను, బహుచక్కగా నున్నది. ప్రతి సన్నివేశము జీవితంలోని వాస్తవికతను చిత్రించేదిగా నొప్పింది. ఉత్తమలక్ష్యాలను, ఆదర్శాలను అనేకఘట్టాలలో ప్రబోధించబడినవి. చిత్రము చూడను చూడను ఆసక్తి యినుమడిస్తుందంటే ఆశ్చర్యకరం కాదు.

ఒకదాసి (పనికత్తె) తన యజమాని కుటుంబ శ్రేయస్సు దృష్ట్యా ఆడినమాట తప్పకుండా, అఖండత్యాగాలు చేసింది. ఈసందర్భంలో తన భర్తకు, బిడ్డలకు దూరమయింది. ఇల్లు వాకిలి, సర్వస్వాన్ని వదిలేసి దిక్కులేనిపక్షిలాగ అలమటించి చివరకు తను, తనభర్త, బిడ్డలు ఒకచోటచేరి ఆనంద భాష్పాలు రాలుస్తారు.

నిత్యజీవితంలో మనకు ఎదురయ్యే వివిధ సమస్యలు, వ్యక్తులు, వారి తరహాలు, లోకం పోకడ చాల సహజంగా చిత్రించబడినవి.

ఈ చిత్రంలోని భూమికలు చక్కగా నిర్వహించబడినవి. శ్రీమతి లక్ష్మీరాజ్యం, యన్. టి. రామారావుగారలు చక్కగా నటించారు.

ఇందులో హాస్యరసం సయితం శివరావు, రేలంగి గారలు సహజంగా పోషించారు.

సంగీతం మనోజ్ఞంగా నున్నది.

ఈచిత్రం విశేషమైన ప్రజాదరణ పొందగలదనుటకు సందేహములేదు. దర్శకుడు శ్రీరంగనాథదాస్ గారికి చక్కని భవిష్యత్తు కలదని యీచిత్రం రుజావు చేసింది.

రాజ్యం పిక్చర్సువారు యింకా అనేక ఉత్తమ చిత్రాలను నిర్మించగలరని ఆశిస్తున్నాము.

'సిసి'




# లోకాన్ని మోసం చెయ్యడానికా!

ఆమహా పట్టణంలో పన్నాలాల్ ఒక షావుకారు. అతని దగ్గర పది పదిహేను మంది నౌకరిచేయుచుండెడివారు.

షావుకారు చాల పిసినారి. తనదగ్గర నున్న నౌకరులకు స్వల్ప జీతము లివ్వడమే కాకుండా క్రమంగా యిచ్చేవాడు కాడు. కాబట్టి నౌకర్లు తరుచుగా మారుతుండే వారు.

ఇలా జరుగుతుండగా పన్నాలాల్ కొంత కాలానికి వ్యాధిపీడితుడై మంచం పట్టాడు. ఒకరోజున హఠాత్తుగా దినవార పత్రికల లోను, కరపత్రములమూలంగాను ఒక ప్రకటన చేయించాడు. అందులో తనకున్న ఆస్తినంతటిని తన నౌకర్లుకు యివ్వదలదినట్లును, తన నౌకరిలో ఒక సంవత్సరమున్నవారికి రు 1000 లు, రెండు సంవత్సరములున్న వారికి రు 2000 లు, మూడు సంవత్సరము లున్న వారికి రు 3000 లు అలాగ 15 సంవత్సరములు పైబడి తన నౌకరిలో నున్న వారికి మిగిలిన ఆస్థినంతటిని యిచ్చు చున్నట్లు వివరించబడింది.

నగరంలోని వారంతా యీ ప్రకటన చూచి షావుకారులో వచ్చినమార్పుకు ఆశ్చర్యపోయారు. ఎక్కడ చూచినా పొగడ్తలు, అభినందనలు ప్రతిధ్వనించినవి.

షావుకారు కుమారుడికి యిది అంతా చూచి పిచ్చి పట్టినట్లయింది. ఆదరా బాదరా తండ్రి పండుకొనియున్న మంచము దగ్గరకు పోయి "నీవు చచ్చేవాడివి చావక కొడుకును నేను ఉన్నాననే జ్ఞాపకము లేనట్లు యీ ఆస్థినంతా పరారుచేసి నాకుబొచ్చ యిచ్చి పోవాలనుకొన్నావా" అని అడిగాడు.

"పిచ్చివాడా! నీ తెలివి తేటలు ఇంతట్లో నున్నవి. మనదగ్గర నౌకరిచేస్తున్న వాళ్లల్లో ఎవరు ఒక సంవత్సరంఉన్న వాళ్లెవరులేరు. కాబట్టి ఆస్థిపాస్తులంతా నీవేగాని మరొకడి కెందుకిస్తానురా!" అన్నాడు షావుకారు.

"అయితే యీనీ ఎత్తు అంతా లోకాన్ని మోసం చెయ్యడానికన్నమాట" అన్నాడు కొడుకు.

చివుకుల లక్ష్మీకాంతమ్మ



# ఇల్లాలు



శ్రీ విద్వాన్ నాగసిద్దారెడ్డి

రోజూ ఎందుకలా ఆమెను తిట్టూ, కొట్టూ, నానా బాధలు పెడ్తుంటారో నా కర్థమయ్యేదే గాదు. వాళ్లింటి ప్రక్క మిద్దెమీదే నా రూమువడం చేత ఆయింట్లో యేంజరిగినా నా చెవున పడి తీరాల్సిందే. ఆ యింట్లో యెవరు యెవర్ని బాధిస్తున్నారు? ఎందుకు? కనుక్కుందామనే వుబలాటం నాలో ప్రశతిమించుతూ వుంటుంది. కాని 'ఉడత కెందుకు వూళ్లో పెత్తనమని' నన్ను నేనే సమాధాన పరుచుకుంటూ వుండేవాణ్ణి. మీ రాత్మస్తుతి అనుకోండి, మరేమైనా అనుకోండి. ఒకరు కష్టపడుతూ వుంటే చూస్తూ 'నాకెందుకు లెమ్మ'ని పోయే ఘటం గాదు నేను. అందుచేతనే నాకాయింటి సంగతి ఆ మూలాగ్రం కనుక్కుందామనే ఉత్సాహం.

ఆ రోజు ఆదివారమవడంచేత రూములో కూర్చొని అవసరమైన, అనవసరమైన ఆలోచనలతో బుర్రను పాడుచేసుకొంటున్నాను. ఇంతలో "అమ్మో" అనే ఒక దీనమైనశబ్దం నా చెవినిబడింది. "చచ్చాట్రా యెవరో పాపం" అని దిగ్గున మిద్దెపైకెళ్లి పక్కింట్లోకి "యేమైనాగాని" అని తొంగి చూశాను. ఇంకేముంది? "అమాసె మొగమా, సినిమాకెళ్లాలి ఫేసు పౌడర్ తేవే అంటే కనబడలేదంటావూ, అదెక్కడ దాచిందో శనిపీనుగ" అంటూ రుసరుసలాడుతూ బుసకొడుతూవుండే ఓ యిరవైయేళ్ల యువతి నాకంట బడింది. దేనితో కొట్టిందో ఏమోగాని కారే రక్తాన్ని తుడుచుకుంటూ మరో వ్యక్తి కిక్కురుమనకుండా అలానే నిలబడివుంది.

ఆమెకు యిరువైఅయిదేళ్లుండచ్చు. గట్టిగా గాలి వీస్తే యెగిరి పోతుందా అనేటంత సన్నంగాను, నీరసంగాను, వుందా విగ్రహం. అందమైన ఆ సుంద్రని ముఖంలో విశాలమైన కన్నులు తీర్చిదిద్దినట్లున్నాయ్. ముఖ్యంగా చెప్పవచ్చే దేమంటే యెంత విచారంగాను, దైన్యంగాను వున్నప్పటికీ యేదో చెప్పరాని దివ్యతేజస్సు ఆమె ముఖంలో వుంది. ఆవిడ మనస్సులో యెన్ని అగ్నిపర్వతాలు ప్రేలిపోతున్నాయో. ఆ బరువైన కన్ను రెప్పల్లో నుండి జారే నీటిబిందువులే మనకు సాక్ష్యం.

"పాపం, ఆమె యెంతబాధ పడుతూవుందో పురుషుణ్ణయిన నేను చూస్తూకూడ యేమీసాయం చేయలేక పోతున్నానే" అనే విచారంతో ఆలోచిస్తున్నాను. "వాళ్లెవరు లేని సమయంజూచి ఆమెతోనే 'యెందుకలా వారు బాధిస్తున్నారో అడిగేస్తే? అమ్మో, పాపిష్టిలోకం నిజానిజాలు తెలుసుకోకుండ తప్పెట గట్టుకొని చాటదూ' అయినా యీలోకానికేం పోగాలమో తెలీదుగాని అన్నా చెల్లెళ్లైనా సరే, అమ్మా కొడుకులైనా సరే, ఒంటరిగా కనబడు తేచాలు. రామ, రామ, యింకచెప్పడ మెందుకు? పోనీ, యీపాడులోకం యేమనుకుం నాకేం, నా అభిప్రాయంమంచిదేగదా, నేనెందుకీ లోకానికి భయపడ్డం? ఇంతకూ నేను మంచి యుద్దేశంతో మాట్లాడినప్పటికీ ఆమే దురభిప్రాయ పడితే? సరే, అప్పుడు యోచిస్తాం, సాహసించాను.

అదృష్టవశాత్తు యింట్లో యెవరూలేని సమయం జూచి లోనికడుగుబెడుతూ "ఏమండీ, యింట్లో యెవరూలేరా" అంటూ పిలచాను, లోపల వంట పనిలో లీనమై వుండినదేమో కొంచెమాలస్యంగా ఆమే వచ్చి "ఎవరు తమ్ముడూ; వారు, మాచెల్లెలు కలసి సినిమాకెళ్లారు. వారు రావడానికి రెండు, మూడు గంటలైనా పట్టచ్చు." అని తిరిగి వెళ్లిపోబోతూవుంది. 'తమ్ముడూ' అనే ఆమధురవాక్కు నన్ను సంతోష సముద్రంలో ముంచి తేల్చింది. ఆరేండ్లప్పుడు చనిపోయిన మా అక్కయ్య పిలుపు నాకు స్మృతి పథంలో మెఱసింది. "అక్కయ్యా, వారితో నాకేమీ పనిలేదు. నేను మీతోనే పనుండి వచ్చాను. వేరే విధంగా భావింపకమ్మా" అంటూ ఆమె ననుసరించాను. నామాటల కాదీన వదనంలో చిన్న మందహాసమంకురించి వెంటనే

హాయమైంది. "రా, నాయనా, కూర్చో, యీ నిర్భాగ్యురాలితో నీకేంపని తమ్ముడూ?" అని నాకో కుర్చీ చూపించి నాయెదురుగ్గా ఆమె నిలబడింది.

ఏమని ముందుగా సంభాషించాలో తెలీక కొంచెము సేపు వుక్కిరిబిక్కిరై కడకు 'అమ్మా, నేను మీ ప్రక్కింటి మిద్దమీదే వున్నాను. ప్రతి నిత్యం మీ యింట్లో జరిగే అఘాయిత్యం నా చెవున పడుతూనేవుంటుంది. ఎందుకు నిన్నావిధంగా హింసపెస్తున్నారో తల పగులకొట్టుకున్నా నా కర్థంగావడంలేదు. ఆ విషయం నిన్నే అడిగి కనుక్కొని యేమైనా నేను సాయం చేయగలిగేటట్లయితే చేస్తామని వచ్చాను. దయయుంచి నీ యీ సోదరునితో నీ కెందుకీ కష్టాలో చెప్పితీరాలి" అని యేమి బదులిపలుకుతుందో అనుకుంటూ ఆమెవైపే చూస్తున్నాను. నా మాటలకామె కళ్లల్లో నీళ్లుతిరిగాయ్. జారే కన్నీళ్లను తుడుచుకోవడానికికూడ ప్రయత్నించకుండా "నాయనా, యిన్నాళ్లకు నీ నోటి నుండి వెడలిన యీ సానుభూతి వాక్యాలు నాకెంతో ఆనందాన్నిస్తూవున్నాయ్. కాని జీవితాకాశంపై నిరాశామేఘాలా వరించిన నాకు నీ సాయమెందుకు బాబూ? అయినా నా చరిత్రంతా నీ కెందుకో చెప్పాలనిపిస్తూవుంది. సావకాశంగా వింటావుగదూ" అంటూ ఓ దీర్ఘనిట్టూర్పు విడచి యిలా చెప్పసాగింది-

"నేనోక బీదకుటుంబములో పుట్టాను. అయినప్పటికీ మా అమ్మా నాన్నకు నేనొక్కతెనే కూతురునవడంచేత యెంతో అల్లారుముద్దుగా పెరిగాను. 'నా చిట్టితల్లి నేభాగ్యవంతునికైనా యిచ్చి పెళ్లిచేస్తే హాయిగా, ఆనందంగా బ్రతుకుతుందనే వెఱ్ఱి ఆశ మా తల్లిదండ్రులకుండేది. కాని డబ్బును పెండ్లాడే యీ కాలంలో గుణగుణాల్ని యెవరు చూస్తారు? యేలంకోసరమని మిత్రుడొచ్చినా పది వేలకు పైపాటేగాని దిగిరాడుగదా, కడకు నాకీ నిర్భాగ్యపు రాతవుందేమో అయిదువేలు నగదు చెల్లిస్తే చేసుకుంటామన్నారు మా మామగారు. సరే, యేదో విధంగా అంటే మా అమ్మమెళ్లో మంగళ సూత్రం తప్ప మిగిలిన వస్తువులన్నీ అమ్మి నాలుగు వేలు జమచేసి పెళ్లయిన మరునెల్లోనే ఆ వెయ్యి మట్టచెప్తామన్నారు మా నాన్నగారు. ససేమిరా అంటే ససేమిరా అని కడకెల్లాగో మా తండ్రిగారు మా వారికాళ్లావేళ్లాబడి ప్రార్థించడం చేత యిష్టము లేకున్నా నా మెళ్లో తాళిగట్టారు. కాని నెలలోపల మా అయ్య వెయ్యిరూపాయ లెక్కడ తేడం? గడువులోపల డబ్బు చెల్లించలేక పోయారు మా నాన్నగారు.

బాబూ, పెళ్లయిన నెలరోజులేమి సుఖమనుభవించానో, అంతే. మా మామగారు, భర్తగారు స్వతహాగా మంచివారైనా డబ్బు తేలేదనే మిషతో సూటి పోటి మాటలతో నన్ను వేధించని నిముషముండదు. నా తండ్రి బాకీ యివ్వలేకపోతే నేనేం పాపం చేశాను? ఇంటి దాసీదాన్నికూడ మాన్పించేసి అన్నిపనులు నాచేతే చేయించేవారు. తమ్ముడూ, యేం చేయను? నాదురదృష్టాన్ని నేనే నిందించుకుంటూ వారుచెప్పిన పనులన్నీ చేసేదాన్ని. ఇంతచేస్తున్నా వారు నన్ను దుఃఖ పెట్టడం మానుకొన్నారా? "దరిద్రపు మొగం మాకెక్కడ దాపురించిందనీ, దాసీముండను నాభార్య అని యెలా చెప్పుకోవడమనీ నాభర్తే నన్ను హింసిస్తూవుండేవారు. అన్ని బాధలను సహిస్తూ వొళ్లు హూనమయ్యేటట్లు కన్న చాకరీ చేస్తున్నా వారికి తృప్తికల్గ లేదేమో, ఎవరో డబ్బువేలిస్తామన్నారని నేనుబ్రతికుండగానే రెండో పెళ్లికూడ చేసుకున్నారు" అని చెప్తూ వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక బావురు మని యేడ్చింది.

ఆమె చెప్పే విషాదగాథను వింటూవుంటే నాకళ్లు చెమ్మగిల్లాయ్. ఉబికి వచ్చే శోకాన్ని దిగమ్రింగుకుంటూ "ఎందుకక్కయ్యా, ఏడుస్తావ్. యీ జన్మలో గాకున్న మరుజన్మంలోనైన యీ దుర్మార్గులకు తగిన ప్రాయశ్చిత్తం జరుగకుండ పోతుందా?" అని యేదోవిధంగా ఓదార్చాను. కన్నీళ్లు తుడుచుకుంటూ తిరిగి ఆమె యిలా చెప్పసాగింది.

"నాయనా రెండో ఆవిడ వచ్చింది. ఆమె ధనవంతుల బిడ్డ అవడం చేతను, ఇంగ్లీషు అంతో యింతో చదువుకోవడం చేతను, నేటి నవనాగరికతా లక్షణాలన్నీ ఆమెలో అచ్చు గ్రుద్దినట్లున్నాయ్. ఉదయం వారు లేచేసరికల్లా కాఫీ సిద్ధం చేయడం మొదలు రాత్రిపడుకొనే వఱకు అన్ని పనులు బహుజాగ్రత్తగా నేను నిర్వహించవల్సిందే. అటు మామకు, భర్తకు, యిటు మాచెల్లెలికీ విరామం లేకుండ సేవచేయడం చేతను, పైగా సంతోషమంటే యెలా వుంటుందో తెలీక పోవడం చేతను, నేనెలా కృశించి పోయానో చూస్తున్నావుగదూ? ఇంత బండ చాకిరీ చేస్తున్నా లేనిపోని వన్నీ భర్తతో చెప్పి చావగొట్టిస్తూ వుంటుంది మాచెల్లెలు. మొన్న పేసు పౌడరు కన్పడలేదని చేతనున్న గ్లాసుతో కొట్టిన దెబ్బ చూడు బాబూ, పాడుదెబ్బ కొంచెము క్రిందతగులక పోయింది హాయిగా చనిపోయేదాన్ని. యింతకూ ఆపౌడరు వెదకితే తనపెట్టెలోనే కనబడ్డది. భర్త కొట్టేదెబ్బలతో, మామగారి యీసడింపులతో, సవతికి చేయాల్సిన సేవతో, యేదో వొకవిధంగా యీ మొండిప్రాణాన్ని — బాధలు చాలవని గుండె జబ్బుకూడ యేర్పడింది. నేను బ్రతికితే మాత్రం యింకెన్ని దినాల్లేతండ్రీ." అంటూ తనకథ ముగించింది.

ఆమె చెప్పిన కథంతా విన్నాను. ఆవిడకెలా సాయం చేయాలో బోధపడ్డంలేదు. వెధవ కట్నాలతో యెన్ని జీవితాలు నాశనమౌతున్నాయో? యీనాటి దౌర్భాగ్య దామోదరుల కేమిచేటుకాలమోగాని వచ్చే భార్యయెంత డబ్బుతెస్తుందనే యోచనేనా? యెంత గుణవతియైనా, ఎంత సౌందర్యరాశిఐనా డబ్బుచెల్లించలేక పోయిందా, ఆమె నిర్భాగ్య జీవిత మడవిగాచిన వెన్నెలేగదా, ఛీ! ఛీ! అని తలచేత్తో పట్టుకొని యీలోకాన్నే మఱచి ఆలోచిస్తున్నాను.

చెడ్డకాలమనేది, యెప్పుడు, యేరూపంలో వస్తుందో వూహించే వాఁడెవడు? "ఎవడే వీడు? ఒంటరిగా యేమిటే వానితో సరసాలాడుతున్నావ్. నీసైతాను మొఖానికి పైయాటలుగూడ వున్నాయా? దెష్టపీనుగా" అని నిందించే ఆమె మామగారి కఠోర వాక్యాల కులికిపడి లేచాను. ఏదో వూరికెళ్లి అప్పుడే దిగబడ్డాడు కాబోలు. చేతిలో సంచి దిగువ పెట్టకుండానే పనికిమాలిన కోతకూతలు కూస్తున్నాడు. అతనిమాటల కామె నిలువునా నీరైపోయింది. నేను మాత్రమాతని మాటలకు సహింపలేక పోయాను. "క్షమించాలండీ, యీమె నాకు చెల్లె ... ..." అని చెప్పబోతున్నాను. ఆముసలి దద్దమ్మ నామాటలన్నీ వింటేనా? "నోరుముయ్. బుద్ధిలేని వెధవా, చేసేదుర్మార్గము చాలకుండ యింకా యేమేమో వాగబోతున్నావ్? నడు, ముందుకు" అని గదమాయించాడు. ఇంకేమి నోరు తెఱచినా బయట దేహశుద్ధి జరిగి తీరుతుందనే నమ్మకంతో దీనంగా చూస్తూ నిర్జీవంగా నిలబడివున్న మాఅక్కయ్యవైపు చూడ్డానికూడ భయపడి మెల్లగా జారుకున్నాను.

ఇంకీరూములో నుండటం ప్రమాదమనుకుంటూ, పాపం, ఆమెకు లేనిపోని బాధలు నేనే తెచ్చిపెట్టానే అని చింతిస్తూ, ఇంతకూ దైవనిర్ణయమెట్లుంటే అలా జరిగి తీరాల్సిందే గదా అని నన్ను నేనే సమాధాన పఱచుకుంటూ, ఎవరైనా నాకొఱకు వస్తారేమో, ఎందుకైనా జాగ్రత్తమంచిదని తలుపు భద్రముగా గడియవేసుకొని వద్దనుకున్నా పైబడే నిద్రాదేవి కౌగిలిలో లీనమయ్యాను.

తెల్లవారింది. రాత్రిజరిగిన సంఘటనను తలచుకుంటూ, మా అక్కయ్యను రాత్రి ఆదుర్మార్గులు బ్రతుకనిచ్చి యుంటారా? అనుకుంటూ బైటకు వచ్చి వీధివైపు చూచాను. ఇంకేముంది? నేనేమని అనుమానపడ్డానో అంతాజరిగి పోయింది. ఆమెశవాన్ని బైటకు పడుతున్నారు. ఆదృశ్యాన్ని చూచిన నాకు గుండె పని చేసేదీ, లేనిదీ కూడ సంసయమైంది. "రాత్రి గుండెజబ్బుతో మరణించిందట. పాపం. మంచియిల్లాలు" అనే అమ్మలక్కల మాటలు ములుకుల్లా చెవుల్లో నాటుతున్నాయ్. ఆశవం దగ్గఱ మొసలి కన్నీరు గార్చే ఆధూర్తుల జూచి 'అయ్యో' అని నిట్టూర్చింది లోకం. కాని ఆపాడు ప్రపంచాని కాయిల్లాలిని ఆనరరూప రాక్షసులే కొట్టిచంపారనే నిజ మెలా తెలుస్తుంది?




రాయలసీమ రత్నరాశి : సంపాదకుడు విద్వాన్ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి ; ప్రకాశకులు శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమండలి, అనంతపురం, వెల రు 1-4-0.

ఇందు అనేక సుప్రసిద్ధ రచయితల, కవుల గద్యపద్య రచనలుగలవు. ఇవి అమూల్యమైనవే కాక మృదుమధురమగు శైలిలోనున్నవి. ఇందలి రచనలు రాయలసీమను దృష్టియందుంచుకొని రాయలసీమ రచయితలు, కవులు వ్రాసినవి. ఈ సందర్భంలో ఆంధ్ర భాషాసేవచేయుచున్న కవులను, రచయితలను ప్రోత్సహించుచు రాయలసీమకు వన్నె తెచ్చుచున్న శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమండలి వారు అభినందనీయులు.

పద్మపురాణము (ఆదిమఖండాంధ్ర వచనము) : శ్రీ మరువాడ శంభన్నశాస్త్రి, ప్రకాశకులు : సాధనగ్రంథమండలి, తెనాలి. వెల రు 1-8-0.

ప్రసిద్ధికెక్కిన 18 పురాణములలో నిది యొకటి. ఇది విష్ణుకథా ప్రధానమైనది. ఇందులో వారణాశి, గయా, ప్రయాగ మొదలగు క్షేత్రమహాత్మ్యములున్నూ, జంబూ, శాకాదిద్వీపవిషయాలున్నూ, నర్మదాది మహానది మహాత్మ్యములున్నూ, ధర్మ విశేషాలున్నవి. ఈ గ్రంథము తెలుగులోనున్నా సులభశైలిలో లేదు. ఇకముందైనా తేలికభాషలో వ్రాసినచో జనసామాన్యానికి పఠనయోగ్యంగా నుంటుంది.

తేనెసోనలు - (ప్రథమకోశం) విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు, 66 సామి పిళ్లెస్ట్రీటు, చూళ, మద్రాసు. వెల రు 1-4-0.

ఈగ్రంథము షుమారు 93 పుటలతో ముచ్చటగా తయారయింది. ఇందలి గేయాలు, పద్యాలు గ్రంథము యొక్క పేరుకు తగినట్లు మధురంగానున్నవి.

గ్రంథకర్త పండితులు. వారి గద్యపద్య కవిత్వము అనర్ఘమయినది. ఈగ్రంథములో గేయరచనయందు సయితం వారి రచనా సామర్థ్యము అసమానమైనదని తెలుపుచున్నది.

ఇందలి గేయాలు, పద్యాలు యింతకుముందు ఆంధ్రవాణి, మాతృసేవ, గృహలక్ష్మి పత్రికలలో ప్రచురించబడినవే యైనను అందలి భావాలు పండువలిచి నోట్లో పెట్టినట్లు సులభగ్రాహ్యంగాను, మనోజ్ఞంగా నున్నవి.

శ్రీ శర్మగారు కవి, పండితుడేకాదు; సాహిత్యరంగంలో వారుచేయుచున్న పరిశోధన అమూల్యమైనది. వీరి యీ గ్రంథం సర్వజన ఆదరణపొందగలదనడంలో సందేహము లేదు.

చక్కనికథలు (1,2 భాగములు) : కవితిలక, కవితా విశారద కాంచనపల్లి కనకాంబగారు; ప్రచురణకర్తలు: కవితిలక గ్రంథమాల, విజయవాడ-2.

ఇందలి కథలు బాలబాలికలకని ఉద్దేశించబడినవి. విద్యాభివృద్ధికి వారి చిన్నచిన్న కథలు సాధనభూతములనుటలో సందేహము లేదు.

ఇందలి భాషాశైలి సరళంగానుండి కథలు బాలబాలికలను ఉత్సాహపూరితులను చేయునవిగా నున్నవి.

# సంపాదకీయములు

## సంతాన నిరోధం

అసలు సంతాన నిరోధం అనేమాటే వెగటుగానున్నది. అంటే చికిత్సల మూలంగా సంతాన ప్రాప్తిని అరికట్టడమునకు ప్రణాళికలు, సమావేశాలు ఏర్పాటు చేయుచుండటం వింతయైన విషయం.

అయితే ఆరోగ్య రక్షణకొరకు, పెరిగిపోతున్న జనాభాతోపాటు పేదరికం ప్రబలిపోతున్నందున నివారణకు సంతాన నిరోధానికి చికిత్స అవసరమనేది కొందరు ప్రముఖుల వాదన.

ఆరోగ్యం సన్నగిల్లుతున్న మాట వాస్తవమే. పుట్టిన సంతానము క్రమక్రమముగా బలహీనమగుచున్న మాట వాస్తవమే. ఇందుకు పరిష్కారమార్గం కృత్రిమపద్ధతులద్వారా సంతాన నిరోధం అని మాత్రం అనడం చాల బలహీనమయిన వాదన.

ప్రజలకు పుష్టికరమైన ఆహారలోపం, సవ్యమైన వైద్యసహాయలేమి, సంఘంలోని కొన్ని మూఢనమ్మకాలుకూడ యిందుకు కారణము.

విశాలమైన భారతదేశంలో ప్రజలు తాము సుఖపడి యితరులకు సహాయము చేయగల అవకాశాలుండి కూడ వానిని వినియోగించుకోగల స్థితిలోలేక ఆకలి దప్పులతో అలమటిస్తున్నారు. ఇక కాలేకడుపులతో ఆరోగ్యరక్షణ ఎలాసాధ్యమో అర్థంకాదు. పుష్టికరమైన ఆహారం సమకూరనినాడు పుట్టే సంతానం మాత్రం ఎలాగ బలిష్టంగా తయారగుతుంది? దాని ఫలితంగా అనేక వ్యాధులు. తగువైద్య సహాయమైనా యున్నదాంటే అదీలేదు.

ఇక సంఘం చూద్దామా అంటే పూర్వాచారాలకు, మూఢనమ్మకాలకులోనై తన అభివృద్ధివైపుకు మరల లేకున్నది. స్త్రీ పురుషులిద్దరు యుక్తవయస్సువచ్చి దృఢగాత్రులుగానయి, స్వయంపోషకంగా నగువరకు వైవాహిక జీవితానికి విముఖులుగా నుండటం చాల అవసరం. ఇందుకు తగిన కట్టుబాట్ల విషయంలో సంఘం శ్రద్ధవహించి అమలుపరిస్తే సంతాన నిరోధానికి కృత్రిమ పద్ధతుల అవసరమేలేదు. తాము నడిచే నడతలోను, ధరించే దుస్తులలోను, తినే ఆహారంలోను చదివే వాఙ్మయంలోను ఉద్రేకపరిచేవానిని వైవాహిక జీవితమున ప్రవేశించేటంతవరకు అరికట్టడంవలన చాలమేలు కలుగుతుంది.

ఇక మనదేశంలో వితంతు వివాహాల యెడల వైముఖ్యమును యింకా కొందరు కలిగియుండటమువలన వేలుకంటె కీడేజాస్తి. బాలవితంతువులకేకాదు - వయసుమీరినవారు సయితం పునర్వివాహం చేసికోదలచినచో స్వేచ్ఛగా నవకాశములను కలుగజేయడం మంచిది. దానివలన కృత్రిమపద్ధతులద్వారా సంతాన నిరోధమునకు ప్రాకులాడటం తగ్గుతుంది.

కాబట్టి సంతాన నిరోధానికి కృత్రిమ పద్ధతులకొరకు ప్రాకులాడేముందు దేశంలోని వాస్తవిక పరిస్థితులను గుర్తించి బలిష్టమైన హైందవజాతి నిర్మాణానికిగల ఆటంకాలు తొలగే మార్గాలను గుర్తించి భారతజాతీయ విశిష్టతకొరకు కృషిచేయడం సముచితం.

## నిరాహారదీక్ష

నిరాహారదీక్ష యనునది గాంధీజీపెట్టినభిక్ష. స్వార్థరహితంగా ప్రపంచ కళ్యాణాన్ని ఉద్దేశించి ఆలక్ష్య, ఆశయాలసిద్ధికి అవసరమయితే తన ప్రాణాలను సయితం త్యాగం చెయ్యడం అభినందించతగింది.

ఇది అహింసా సమరంలో తన అమోఘమైన ఆత్మశక్తిని ప్రదర్శించుకోగల తుదిఘట్టం. ఇదే యీనాడు శ్రీ పొట్టి శ్రీరాములుగారు చేస్తున్నది.

శ్రీరాములుగారి ఆరోగ్యం క్షీణిస్తూ ఆందోళనకరంగా నున్నది. ఆయన ఏరాజకీయ వర్గానికి చెందినవాడు కాడు. ఆయన లక్ష్యం న్యాయంగా ఆంధ్రులు సర్వతోముఖాభివృద్ధి నొందడానికి అవసరమయిన సత్వర సమగ్రమైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణం; అందుకుగాను విభిన్నదృక్పథాలతోనున్న వివిధ రాజకీయ వర్గాలను సంఘటితపరచి చైతన్య పూరితులనుచేసి సత్వరరాష్ట్ర నిర్మాణాన్ని సులభసాధ్యం చెయ్యడం.

ఆయన యీ సందర్భంలో తన ప్రాణాలను సయితం త్యాగంచెయ్యడానికి పూనుకున్నాడంటే అది ఆంధ్రప్రజానీకానికి, వారిభావి భాగ్యోదయానికిని, అది ప్రజలు గుర్తించి తమ న్యాయమైన హక్కులకొరకు, అవకాశములకొరకు ఏకోన్ముఖంగా కృషిచేసి సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు పూనుకోవాలి. ఆనాడే ఆయన ప్రాణములను రక్షించకలుగుతారు; ఆంధ్రజాతి బాగుపడుతుంది.

శ్రీ శ్రీరాములుగారి నిరాహారదీక్షవలన ప్రజలలో ఏర్పడిన చైతన్యం అచంచలమైన దీక్షకు కారణము కాగలదని మా నమ్మకం.

శ్రీరాములుగారికి లక్ష్యసిద్ధితోబాటు సంపూర్ణ ఆయురారోగ్యములను ప్రసాదించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

## 'గృహలక్ష్మి'

### సంక్రాంతికి ప్రత్యేక సంచిక

ముచ్చటైన త్రివర్ణముఖచిత్రంతో మంచి మంచి కథలు, నాటికలు, గేయాలతో జనవరి 15-వ తేదినాడు సర్వాంగ సుందరంగా వెలువడుతుంది. ఇంకా వివిధ ఆకర్షణీయమై శీర్షికలు, బొమ్మలు యిందలి ప్రత్యేకత.

రచయితలు, రచయిత్రులు త్వరలో జనవరి 5-వ తేదిలోపల మా కార్యాలయమునకు తమ అమూల్యమైన వ్యాసములనుపంపి మా ప్రయత్నమునకు సహకరించవలసినదిగా కోరుచున్నాము. ప్రత్యేక సంచిక ప్రతులను పరిమితంగానే ముద్రించదలిచాము కాబట్టి ఏజంట్లు తమకు కావలసిన ప్రతులకు, విడిప్రతులు కావలసినవారు త్వరగా వ్రాయాలని మా మనవి.

సంపాదకుడు




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము వంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఁడుండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# శ్రీ నందననామ సం॥ర మార్గసిర-పుష్యమాసములు.

| | | | |
|---|---|---|---|
| 1952 సం॥ డిసెంబరు నెల | 16 | మం | చతు 6.42 జ్యే 57.19 త్యా 3.59 కృష్ణాంగారకచతుర్దశి |
| | 17 | బు | ● అమా 4.36 మూల 55.44 త్యా 3.44 పిండపితృయజ్ఞః |
| | | | పుష్యమాసం |
| | 18 | గు | శుద్ధపాడ్యమి 1.10 ఏవ్యంపూషా త్యా 3.50 |
| | 19 | శు | తృ 51.56 ఉషా 49.28 త్యా 3.46 |
| | 20 | శ | చ 46.0 శ్ర 45.20 |
| | 21 | ఆ | పం 39.43 ధ 40.48 త్యా 3.42 |
| | 22 | సో | ష 33.22 శత 36.10 త్యా 3.43 కుమారషష్ఠిప్రదోషః |
| | 23 | మం | స 27.11 పూభా 31.44 త్యా 3.44 శవేఅమృతయోగం |
| | 24 | బు | అ 21.27 ఉభా 27.45 త్యా 3.47 తిథిద్వయం |
| | 25 | గు | న 16.22 రే 24.27 త్యాజ్యాభావః |
| | 26 | శు | ద 12.11 అశ్వ 22.3 త్యా 3.55 |
| | 27 | శ | ఏ 9.4 భ 20.44 ని 28.18 భ 9.4 రా 22.48 వైకుంఠైకాదశి, శ్రీరంగక్షేత్ర ద్వార దర్శనం |
| | 28 | ఆ | ద్వా 7.7 కృ 20.35 |
| | 29 | సో | త్ర 6.26 రో 21.39 |
| | 30 | మం | చతు 7.1 మృ 23.55 త్యా 4.14 |
| | 31 | బు | ○ పూర్ణిమ 8.47 ఆర్ద్ర 27.19 త్యా 4.18 హిమశోధనపూర్ణిమ, చిదంబరక్షేత్ర ఆర్ద్రాదర్శన మహోత్సవం |
| 1953 సం॥ జనవరి నెల | 1 | గు | కృపా 11.38 పున 31.10 త్యా 4.21 |
| | 2 | శు | వి 45.21 పుష్య 36.50 త్యాజ్యాభావః |
| | 3 | శ | తృ 19.44 ఆశ్రే 42.31 త్యా 4.23 శూన్యతిథిః |
| | 4 | ఆ | చ 24.31 మ 48.31 త్యా 4.24 |
| | 5 | సో | పం 29.26 పూఫ 54.34 త్యా 4.25 |
| | 6 | మం | ష 34.10 ఉఫ 60.10 త్యా 4.24 |
| | 7 | బు | స 38.28 ఉఫ 0.43 |
| | 8 | గు | అ 42.2 హ 5.24 త్యా 4.18 |
| | 9 | శు | న 44.43 చి 9.48 త్యా 4.14 |
| | 10 | శ | ద 46.16 స్వా 13.14 త్యా 4.10 |
| | 11 | ఆ | ఏ 46.36 విశా 15.33 త్యా 4.5 |
| | 12 | సో | ద్వా 45.37 అనూ 16.40 |
| | 13 | మం | త్ర 43.20 జ్యే 16.34 త్యా 3.55 భోగ్యత్సవం |
| | 14 | బు | చతు 39 58 మూ 15.17 మాసశివరాత్రి, ఉత్తరాయణ పుణ్యకాలం |
| | 15 | గు | ● అమా 35.30 పూషా 12.57 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor: Dr. K. N. Kesari.